# శ్రీ వేమయోగీయము



కర్త:

నాదెళ్ల మేధాదక్షిణామూర్తి

# శ్రీ వేమ యోగీయము



కర్త,

నాదెళ్ల మేధా దక్షిణామూర్తి



కృష్ణా స్వదేశీ ప్రెస్, బందరు.

1955



[రు 1-8-0

శ్రీ మేధాదక్షిణామూర్తయేనమః

# కవియోగులు

మానవమనస్తత్త్వము విభిన్న వికాస విలసితము. తత్సంస్కారము దేశకాలపాత్రోచితమైయుండును. ఆయా సంకలనముం బట్టి లక్షకొక్కఁడు 'కవి' యుం గోటికొక్కఁడు 'యోగి' యుం గానౌను. తత్తదుభయసంవిత్సంయోజనము క్వాచిత్కముగా నొదవి తత్కర్తృ శశ్వత్క మౌచుండును.

కొందఱిదృష్టిని గవితాయోగితోభయసందర్భమే పొసంగ నేరదు. ఏలయన, 'దృష్టిరమ్యాయోర్మితరీతాస్వాయ' మ్మన నెవ్వఁడు 'క్రాంతదర్శిత్వ' విలసితుఁడై ప్రకృత్యంతర్లీన సౌందర్యమయానంద రస తరంగడోలికలం దూఁగుచుండునో వాఁడే 'కవి'. ఇట్టి యైహికమెల్ల గర్హించి ప్రకృత్యతీత సచ్చిదానంద పరబ్రహ్మ సాక్షాత్కారమొదవించికోఁగల్గినవాఁడే 'యోగి'. కవి నిజదృష్టివైలక్షణ్యముచే నాకర్షితమైన దానియందలి రామణీయకత కక్షురత్వమును గల్పించి యొరుల మనఃఫలకముల కెక్కింపఁజాలును. యోగియన్ననో, మనోలయ మొదవించికొని కనుమూసినను దెఱచినను సర్వము బ్రహ్మమయముగా ననన్యస్థితినంది 'యతోవాచోనివర్తంతే' యన్నట్లు మౌనమును వహించియుండును.

ఇట్టి పరస్పర విభిన్నత నెంచి 'కవియోగు' లననేచెల్లదా యన్న, 'నానృషిః కురుతేకావ్య' మ్మన్నయార్యోక్తియట్టులుండఁ బ్రాచేతసవ్యాసప్రభృతుల నేమందము? మనకు వీరెట్లో పాశ్చాత్యులకు 'హోమర్' "వర్జిల్" ప్రభృతులు నిట్టివారేయాయె. వారెంతెంతటి మేటికవీంద్రులో యంతంత వేదాంతులు నైరయ్యె. అట్టి యెడఁ బూర్వోక్త వైరుధ్య సమన్వయముకొఱకు మన మిచ్చో లక్ష్యముగా 'వేమయోగిం' గూర్చి ప్రస్తావించికొందము.

అతఁ డాంధ్రదేశమున నేమూగచింతపల్లిలోనో పదేడవ శతాబ్దియం దాగర్భశ్రీమంతుఁడుగాఁ బుట్టిన పాకనాఁటిరెడ్డి వంశజుఁడు. గారాబముగాఁ బెరుఁగుటచే నాతని కబ్బినవిద్య యత్యల్పము. జవ్వనంబుతఱి నేకొండవీటి వేశ్యపొత్తుననో యుండఁగాఁ జిత్తము మాఱిపో, నొకయోగిసత్తము చేరికవల్ల నీరికలాఱ నద్వైతసంస్కారముం గవితాధారయుం బ్రాపించినవాఁ డాయెను. ఆపై నాతనినోట వచ్చినచాటూక్తులెల్లఁ బద్యములై శ్రోతలకు హృదయాకర్షకములు గాఁగా నానోట నానోటఁబడి యందెన్నెన్నియో లోకోక్తులై పోయినవి. అట్లు తనమదికిఁ బొడకట్టిన దేనినైన యథాతథముగా నొరులమనంబుల కెక్కింపఁజాలెను. అట్టివీ తెలుఁగుగడ్డ యున్నంతవఱకు నిలిచిపోఁదగ్గవే.

రామశబ్దమైనరాని యావేమన్నభాష పామరులకైన నందుపాటు కాఁదగు తేటతెలుఁగు జాతీయముల కిక్కయౌట నందఱమనంబులకు సులువుగా నెక్కెను. ఆతని యుపమానము లశ్రుతపూర్వములై యందు నవ్యతతోఁపఁ దత్కవిత కవి జీవప్రాయములై ప్రకృత్యనుభవసిద్ధములుగా నుండును. అం దెందును నెరువుసొమ్ములనఁదోఁచు శబ్దాలంకారములుగాని నిగూఢములనిపించు నర్థాలంకారాదికములుగాని పాదపూర్తులకౌ వ్యర్థపదములుగాని లేక, హాస్యనిలయమగా భావనాసంపదమీఱఁ గొండంతయర్థము గోరంతలోనే యిమిడిపోఁగా, నల "కార్లైలు"గా రన్న "మారిసన్సుపిల్" కంటె గాఢతరములైన యమృతఘుటికలుగా వెలసి యింపులుగులుకుచుంటచేఁ బలుమాఱు స్మరింపఁజేయుచుండును.

మఱియు నాతండు నన్నయాదులయట్టి లాక్షణికతగాని పెద్దనాదులకుదీటౌ ప్రబంధనిర్మాణదక్షతగాని లేనివాఁడైనను, "వాక్యం రసాత్మకం కావ్య" మ్మన్నదానికి లక్ష్యభూతములౌ చాటుపద్యములందు లోకసామాన్యాంశములకే నిజభావనాశక్తిచే జీవముఁ బోయఁజాలిన స్వాతంత్ర్యము రూపింప మనోహరత్వము దీపింపఁ జేయుటచే ఖండకావ్యోదయరూప నవ్యకవితాభ్యుదయము

నకు మార్గదర్శి యనిపించికొనఁజాలెను. కాని 'రససిద్ధాః కవీశ్వరా' యన్న యార్యోక్తికిరవుగాఁదగ్గ యుద్రేకజనకమైన నిసర్గ సౌమనస్యముమాత్రి మీతనియందు లుప్తమై లోకవిమర్శనోత్సేకమే మెండుకాఁగాఁ "గృశాను" దృష్టిగాఁ గాకయున్నను, నిర్దాక్షిణ్యముగాఁ గృత్రిమవేషధారిత్వాదికముల నెంతయు గర్హించువాఁడై, తఱచు పరిహాసాత్మక ప్రసంగములకుం గడంగుచుండెను. అట్లని యౌచిత్యముండదొఱంగె ననియుం జెప్పనొప్పదుగాని 'మకురుపా' లనిపింపఁదగ్గ దురుసుతన మొక్కొక్కెడఁ గానుపింపకపోదు.

అగుచో నిది యోగిత్వలక్షణముమాత్ర మౌనాయన్న సిద్ధస్థితియం దిది యప్రసిద్ధమే యయినను, సాధనావస్థలోఁ దనకబ్బిన వేదాంతమువల్ల స్వప్నదృష్టం బనఁదోఁచు నీయైహికంబునుండి నిజమనంబును మరల్చికోఁజూచు పూనికయం దిట్టిప్రసంగియుండు ననఁ జెల్లును. కాకున్న, విభిన్నవిషయ విమర్శనరూప వాక్ప్రచారమున కవకాశము గలుగనేరదు. ఇట్టి లాత్మబోధంబు కానుగాను మౌనంబూని 'యోగి' నా నొప్పెను.

ఇందులకు నిదర్శనముగా నిచ్చో "రంగదాసు" నిం జూచి యుంటిమి. ఈతఁడా బాల్యము నస్మత్పితృపాదులకు శుశ్రూష గావించుచుండినవాఁడు. క్రమముగా నవధూత యౌదనుక నీతనియం దొదవుచుండిన పరివర్తనాదికమున కేన సాక్షినైతిని. గురుశిష్య సమాగమముతఱి నుభయులకుం దుదిదనుకఁ బద్యరూప ప్రసంగమే నడచుటలో, 'నాదెళ్లాన్వయ గురువర !' యని యాతఁడు వందన మందించుచుంటయుం బ్రత్యుత్తర మిడుచోఁ బద్యాంతములం దీగురువరులు 'రంగా!' 'చినవేమన్నా!' "అభినవ వేమా !" యనుచు సంబోధించుచుంటయును నేన వీనులార వినవిన, నట్టి యాశుకవితాప్రచారము నాకును నలవడుటయట్లుండ, నా వేమన్నయు నీతనియట్ల క్రమముగా జీవన్ముక్తుండు గానయ్యె నన్నది నామదికి రూఢమయ్యెను.

అంతట రాయవరపు పూర్ణయాఖ్యుండౌ నస్మత్పితృ చ్ఛాత్రవర్యుం డొక్కం డెంతేండ్లతరబడిగాఁ దిరిగి తిరిగి సేకరించిన శ్రీతాళ

పత్త్రాదికములందలి యీ వేమన పద్యములఁ దానెత్తి యకారాదిగా వ్రాసి తెచ్చి వినిపించుచుండఁగా, నా కందుఁగలిగిన యుత్సాహము కొలఁది నేతాదృశముల నేను నల్లుచు వచ్చితిని. ఆపై, నాపదాఱవ యేట మా తండ్రిగారు 'వేమనసూక్తి రత్నాకర'పుఁబరిష్కరణం బొనర్చుచోఁ దత్సంగ్రహకర్తృ విరచితమైన వచనరూప చరిత్రము నేను సవరింపఁబూనుట సంఘటించెను. దాన నాకిద్దానిని బ్రపంధమమునఁ బ్రబంధరూపము నందింపఁ గుతూహల ముదయింపఁగా 1910 లోనే "శ్రీ వేమయోగీయ" మనుపేర వ్రాసియుంటిని. 1917 లో నద్దానిని ముద్రణమునకుఁ బంపఁగాఁ బరహస్తగతం బై పోయెను.

ఎట్లాయెనేమి, యిది నేఁటి కీరూపమున వెలువడుయోగము కలిగెను. ఇట్టులోఁ దొలుతటిచరిత్రాంశములం దేకొన్నిమార్పులో కావలసిన వైనను, ముందాతఁడు వేశ్యాలోలుఁడై పిదప నెట్లో తన మనసుమాఱఁగా సముచిత వేదాంతప్రబోధానంతరమున నాత్మ బోధంబౌ కవితాప్రచారమునకుం గడంగెనన్న పరిధానవిషయ మట్లే యున్నది. ఇందలి పురవర్ణనాదిక మెల్ల రాజవంశజుఁడుగా నెంచం బడినప్పటిదేయై ప్రాచీనపక్షి ననుసరించినదై యుండ నద్దానినే యథా తథముగా నుంచినందున విప్రతిపత్తి లేదుగదా. మఱియు నాయిక సామాన్యయైనను నసామాన్య గుణగణవిశిష్టయై యౌచిత్యసంపాద కమే యాయె. ఇంక నాయూపాత్రముల సంజ్ఞ లేవయినఁ గథాగమన మున కంతరాయజనకములు గానేరవుగాన నందుంగూర్చినచర్చ యనావశ్యకము. ఇంక నప్పటిశృంగారఘట్టము మాత్ర మిప్పుడు కొంతసంకుచితముగాను వేదాంతప్రబోధఘట్టమే యధికముగాను మార్చుట నిజవయోధర్మము మాత్రమేకాక "యోగీయ"మునకు సముచితముగదా? ఏమయినను 'సమలోష్టాశ్మ కాంచనత్వము నే సాధింపఁజాలినయయ్యోగిపుంగవుఁ డేవేవో బంగారమొనర్చినట్లుండిన లీలల వివరించిన భాగ ముడిగి యచ్చో నాతనిప్రశస్తికి మూలమైన బంగారమువంటి సూక్తిరత్నావళిం గూర్చి చేర్చుటయందలి యౌచిత్యము తద్జ్ఞులకే విశదము.

మఱియు నిందలి తృతీయాశ్వాసగత గురుప్రబోధము శ్రీశంకరకృత "వివేకచూడామణి"కి సారభూతమై కొందఱు జిజ్ఞాసువుల బుద్ధులకే యందుపాటుగానొ నను కొనువా రిందలిచతుర్థాశ్వాసము నందలి పూర్వోక్త వేమనోక్తులు సుగమములౌట సర్వజనసమాదరణీయత నందఁదగియుండునని యెంచకపోరు. ఇంతకు నిద్దానమనము గమనింపఁదగిన దేమన, వేమనయందుఁ గవితా యోగితోభయ మార్గసంధి సంఘటించి వన్నె కెక్కఁజాలెనన్నదే. ఇట్లనన్యప్రచారముగల నిజవాక్కులవల్ల మన తెలుంగున కొకనూతనమైన వెలుంగును గూర్పంజాలిన యీ 'కవియోగీంద్ర' చరిత్రము తత్సూక్తులతోఁబాటు సుస్థిరంబై వెలయ శ్రీగురువర్యుల కృపతోడ్పడనయ్యెడుఁ గావుత.

బందరు,
5-7-1955

ఇట్లు విద్వద్విధేయుఁడు,
నాదెళ్ల మేధాదక్షిణామూర్తి.

---

## శ్రీ వేమయోగీయ విషయసూచిక.

— అవతారిక —

## తృతీయాశ్వాసము



## చతుర్థాశ్వాసము

*కృతిపతికి సహృదయులు కొందఱయయాచిత సాదరోక్తులు*

'ఉభయకవి మిత్ర' 'ప్రతిభారవి' 'కవితాకలానిధి' ప్రభృతి బిరుదాంకిత

శ్రీ భువనగిరి విజయరామకవిగారు, గుంటూరు

శా. శ్రీవిద్వత్పురుషోత్తమార్య గురు పాత్రీభూతశిష్యోత్తమ పు
త్త్రా! వేదస్థిర నాదశాన్వయజ మేధాదక్షిణామూర్తి కా
శ్రీ! వర్ధిల్లు చిరాయురున్నతుల, భక్తిశ్రద్ధలొప్పారు నీ
సేవన్ దండ్రినిదన్పువారలకుఁ దుష్టిన్ బుష్టి నిష్టాప్తియౌన్॥

చ. నిలిపితి తండ్రిచాలు పరినిష్ఠిత తన్నిఖిల ప్రవర్తనా
వళుల విశేషపుష్టులఁ బ్రవర్తిలఁ జేయఁగనోపస న్విరా
జిలి, యిపు డాత్మలబ్ధి పరిషేచనగాఁగఁ దదర్పణంబుగాఁ
గొలిపితి కీర్తికాయపితకు న్గడుధన్యుఁడవైతి సోదరా! 2

క. ప్రాణాహుతిగాఁ బితకు రవాణాఁ జేసితివి తత్ప్రపంచిత 'యాత్రా'
మాణవకకృతి నిఁకిప్పు డపానాహుతి వేమనీయ పాత్యంబయ్యెన్॥ 3

క. వ్యానోదానసమానము లైన నలఁతికాలముననె యర్పింపుమయా
పైని న్షడ్రసభోజన మో! నింతువుగాని రససమాహితకృతితోన్, 4

క. కలషోడశోపచారవి ధులకగు సద్గ్రంథము న్మధురవాగ్రమ్యో
జ్జ్వలత న్బదపడి కూర్చి సఫలీకృత మహార్చనావిభాసివి కమ్మా. 5

తే. భర్తృహరియొక్క త్రిశతక ప్రాయమూచుఁ
గ్రమత శృంగార నీతి వైరాగ్య భాగ
కేవలంబగు 'వేమయోగీయ' మెలమి
నమరు నాచంద్రతారార్కమై ధరిత్రి.

'శ్రీ మద్గురు భాగవత' 'శ్రీ మద్భాగవత మహి' మాద్యనేక గ్రంథ కర్తలు 'నుభయభాషాప్రవీణ' 'వేదాన్తపారీణ' 'కవిశేఖర'

శ్రీ మిన్నికంటి గురునాథశర్మగారు, గుంటూరు.

తాము మిక్కిలిప్రేమతోఁబంపిన 'శ్రీ వేమయోగీయము'ను జదివితిని. పండితకవులగు మీపాత్తమును సాంతముచూడక వదలుదునెట్లు? పదమెత్తిన వృత్త్యనుప్రాసము, పాదమెత్తిన నోజస్సు, నింకయమకముల సెమకసేల? కుప్పలుకుప్పలు. అందును సముద్రయమకము నెక్కువగావాడితిరి. ఒక్కొక్క పాదమున నాలుగంత్యప్రాసములతో సీసముల నిరఁహించితిరి. వర నాదులలోఁ

బూర్వకవులత్రోవఁ దప్పరైతిరి. 'అలూనకిసలయమును' గొని నవీనరసమయ ముగాఁ బోసంగించుట మిక్కిలి పసందుగానున్నది. ఎట్టి దుష్కరప్రాస గండశిలయైనను మీయసర్గళధారలో దొరలుకొనుచుఁ బోవలసినదే. ఆటవెలఁదు లకుఁ జెక్కడకళలు నేర్పితిరి. శివయోగి స్వరూపము ధరించితిరి. 'కామ యాభిఖ్యాతి' పద్యము సాలంకృతమైనదై 'కమనీయవిఖ్యాతి' మీక చేకూర్చును.

ముప్పది నలువది యేండ్లనాఁడే భవ 'ద్యశోవివా' రాదిక సరణి నవభావ గంభీరముగను నానాశబ్దాలంకారాదిశోభితముగను వ్యంగ్యస్ఫూర్తిగను విరాజిల్లి నందులకు నే నాశ్చర్యచకితుఁడ నైతిని. పుట్టుకతోడనే మీరింతప్రౌఢకవితా ప్రద్యుమ్నులరై నిరిగదా. అవునవును. శ్రీ పురుషోత్తములకుఁ బ్రద్యుమ్ను లుదయించుటలో వింత లేదు.

'మేఘసందేశ' 'కుమారకథామంజరి' ప్రముఖ గ్రంథకర్తలు

'విమర్శకాగ్రేసర' విద్వాన్

దీపాల పిచ్చయ్య శాస్త్రిగారు, నెల్లూరు.

'శ్రీ వేమయోగీయము చదివి సంతోషించినాను. తాము వేమనను కవి గను యోగిగను చక్కగా తీర్చినారు. అంతియకాక, ఆతనిని ప్రబంధనాయ కునిగా చిత్రించుట మీ రచనలో గల విశేషము. అటు శృంగారము, ఇటు వైరాగ్యముకూడ మీ కావ్యమున సముచితమార్గమున నడిపింపఁబడినవి.'

'శ్రీ వేమనబోధామృతసారము'తోపాటు మీరు లోకమున కందించిన తత్త్వసందేశము ప్రాజ్ఞప్రశంసార్హముగా నున్నది. ప్రౌఢమధురమగు మీ కవితాశైలి హృదయంగమమై యున్నది.

'యోగానంద రామాయ'ణా ద్యనేక గ్రంథ రచయితలు

శ్రీ చిల్లరిగె యోగానందయ్య పంతులు కవిగారు, అమలాపురము.

'పుత్త్రీకృతినున్న ద్రోణుఁడ'వని ద్రౌపది ద్రౌణి న్వర్ణించి నమస్క రించినట్లు మీకిప్పు నమస్కరించుచున్నాను.

మీ 'వేమయోగీయ' మందలి యాధ్యాత్మికసారము పంచదశి జ్ఞానవాసి ష్ఠాదులవలె నెంతేని సమాదరణీయమై శాశ్వతామే యాత్మరాస్య పఠనీయమై వెలయఁగలదు. నే నద్దానిని విమర్శనేక్షణైకదీక్షతో భక్తిశ్రద్ధాసక్తబుద్ధితోఁ జదివియూనా వార్ధక్యదుఃఖకంధి కిదే నావగా నెంచియిద్దానఁ దరించుచున్నాఁడ.

మ. అనవద్యంబగు పాండితీగరిమ మందాసంస్కృతాంధ్రద్వయిం
గన నభ్యాసమొనర్చి యాంగ్లవిదుఁడై, కన్నయ్య కీకబ్బముగ

జన సమ్మోదదమిట్లొసంగి నిజవైశద్యమ్మును న్వాహరిం
చిన మేధానిధి నాదెళాన్వయవిధు న్శ్రీమీఱ శ్లాఘింపరే ?

మదారాసు యూనివర్సిటీ, శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాలయముల తెలుఁగు రీడర్లు 'నాంధ్రభారత కవితా విమర్శ'నాది కృతికర్తలు నైన

శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు, ఎం. ఏ. చెన్నపట్టణము.

......'శ్రీ వేమయోగీయ, 'నీతిభాస్కరము'లు మీతండ్రిగారి యొద్ద నుండి సాధించి కృషిచేయుచున్న యాధ్యాత్మిక తత్త్వమునకుం బ్రబల నిదర్శనములు.........'ఉత్తమ జీవయాత్ర'లోని వివిధ కక్ష్యల యందలి మహత్తర గుణములు, సాధనలును జదివి మిక్కిలి యానందించితిని. మరలం జిన్ననాఁటి బందరు నాదృక్పథమున నిలిచినట్లైనది.

'శ్రీ శఙ్కరవిజయ' 'కూర్మపురాణ' 'ప్రసన్నరాఘ' వాంధ్రీకరణాదికర్త.

శ్రీ భమిడిపాటి వేంకట సుబ్రహ్మణ్యశర్మగారు, మోపిదేవి.

ఉ. శ్రీగురువర్య పాద సరసీరుహయుగ్మమును న్నుతించి మే
ధాగరిమార్ద్రనై నతివితానము భక్తి మెయింబొనర్చి స
ర్వాగములన్ క్షమించుచుఁ గృపామృతము న్ఘనత న్వహించి నా
పైఁ గురియంగ వేఁడుచుఁ బ్రపన్నుఁడనై లిఖియింతు నిమ్మెయిన్.

మ. కుశలం బోగురుదేవ ! మీదయను మాకుంగా, భవ ద్దివ్యభూ
రిశివంబుం దెలుపంగ సంతతము నర్థి న్వేడెద 'న్వేమయో
గి' శివాపాదక సచ్చరిత్రము లసద్గీర్వైభవం బొప్ప, స
ద్యశ మబ్బ న్రచియించి పంచితిరి గాదా పట్టిచేఁ బెద్దయన్

శా. వింటిన్మీకడ మున్నె దానిదగు పెన్విన్నాణము, న్నేఁడు నేఁ
గంటిం గన్నులముద్రితంబవుచుఁ జక్కంబొల్చు పాత్రమ్ము, వె
న్వెంటం బున్నెపుఁబంట తొంటిది ననుం బ్రేరేపఁగా నోటితో
నంటిన్మంటిని దత్సుధోక్తిలహరీ యాంశాంశము ల్గ్రోలుచున్. 3

చ. గొనములకొల్లనిక్క దొసఁగు ల్లవమేనియులేని దిందిరే
శుని పదకంజమం దెసఁగుచుం బ్రవహించెడు జాహ్నవీ సుపా
వనతర మాధురీభరిత వంజులధారకు నుద్ది, పూజ్యపా
ద నిహిత వేమయోగి చరితప్రథిమ న్గవిత న్నుతించెదన్. 4

తే. దక్షిణామూర్తి కర్త మేధావిలాసి
వర్ణ్యమౌ వేమయోగి వరచరిత్ర
నేత కవిపూరుషోత్తమ ఖ్యాతకీర్తి
రసమొలుకఁ గ్రోలుఁడీ వెన్నిరసికులార! 5

‘ఆంధ్రచరిత్రా’ది గ్రంథకర్తలు, వీరేశలింగం హైస్కూలు పండితులు

శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు, రాజమహేంద్రం

తాము ప్రేమతో నంపిన ‘ఉత్తమజీవయాత్ర’ ను ‘వేమ యోగీయము’ను నే నందుకొని కన్నుల కొత్తుకొన్నాను. మీ కబ్బములు మహోత్తమ కావ్య ధోరణిలో రచింపఁబడినవి. అందలి పద్యములు ప్రౌఢములై రుచిరములై నన్నానందముగ్ధు నొనర్చినవి ... ఛందోమూర్తులు శాశ్వతులు నగు శ్రీ పురుషోత్తముల పుణ్య చరితమును పద్యప్రబంధముగా రచించుటే మిక్కిలి మంచిది. తమరు జనకులపట్ల అధమర్ణతఁ బాపికొన్న ధన్యమూర్తులు. తమ శ్రీ చరణములకు నా ప్రణతులు.

శ్రీ అప్పల వేంకటరావుగారు, పౌరాణికులు, సామర్లకోట.

మీ ‘వేమయోగీయము’ నామూలాగ్రముగా మహాసక్తితోఁ జదివి పూర్తి చేసినాను. మీయమూల్యభావములతోడను అఖండమేధాయుక్త భాషాజ్ఞానముతోడను వెలయింపఁబడిన యీ పద్యకావ్యము సౌష్ఠవముతో సాఫీగా నడచినది. భావములకు భాష యలంకారము పెట్టుచున్నది. విషయమునుబట్టి భాష అప్రయత్నముగా వచ్చుస్వభావమై శిష్టప్రబంధశైలిలో నున్నది- భాషాపరిమేయ మే మాత్రమున్న పాఠకులైన నందలి చెలువుతీపి ననుభవింపఁగలరు.

గమనిక.

| పుట. | పఙ్క్తి. | కూర్పు. | మార్పు. | పుట. | పఙ్క్తి. | కూర్పు. | మార్పు. |
|---|---|---|---|---|---|---|---|
| 14 | 4 | భవ్యో | మాన్యో | 33 | 8 | వ్రేలఁ | వ్రేలఁదలన్ |
| 22 | 17 | యామా | యీమా | 70 | 12 | *ధాత్రోపేంద్ర | ధాత్రజ్ఞాతు |
| 26 | 18 | డోడు | డగుడు | 71 | 2 | చతుర్ధా | చతుర్థా |
| 29 | 24 | తాత్మ | తాత్మత | 76 | 6 | మాతృ | మాత్రి |
| 30 | 6 | దు, నో | దుఁబో | 88 | 26 | మద్వై | మాపై |
| 32 | 18 | రంభా | డంబా | | | | |

* స్థితస్యగతిః :— ధః(బ్రహ్మవిద్యాయం) + అత్రిమ్ (పాయస) మితి.

శ్రీ మేధాదక్షిణామూర్తయేనమః

# శ్రీ వేమయోగీయము.

అవతారిక

ప్రార్థనాదికము.



వాణీశ్వర నిర్జరేశ్వనుత స
చ్ఛ్రీమూర్తి, కాత్యాయనీ
భావాబ్జార్కుఁడు, భక్తవత్సలుఁడు, జృం
భద్దైత్య సారంగరా
డ్గ్రాస చ్ఛేదక వజ్రి, నిర్జిత పుర
కర్జివ్యాద సర్వోదయున్
దేవాధీశ్వరుఁ గాలకాలు, ననుసం
ధింతున్ స్వప్రబంధంబునన్.

ఉ. శశ్వ దనూన కీర్తి విలస న్మహనీయచరిత్రుఁ డర్థనా
కీశ్వరుఁ డొంటెఁ డొంట, హృదయేశ్వరి యీశ్వరి పార్శ్వమందుఁ గా
మేశ్వరి తానయుండి హృదయేప్సితము ల్ఘటియిల్ల మాకు ము
దశ్వరథార్థ సంపదల, సంతత మొసఁగుచు నెమ్మనంగెడున్ 2

శా. ప్రారంభించుతఱిన్ శ్రుతి స్మృతులు, లోకం బెద్దియు న్నామికన్
హేరంబుం దొలుదొల్త మ్రొక్కెదరు కాదే, యట్టి యావేల్పు నీ
హారాద్రీంద్ర సుతాంకపీఠిఁ దగి సధ్యానంబు ధ్యానింపమి
స్వైరుం డాతఁ డొసంగె దీనఁ గృతి నిర్విఘ్నంబు గానయ్యెడున్ 3

ఉ. శ్రీయుతమూర్తి భాస్వర చరిత్రుఁ డు మాధవు చేతనేతగున్
సాయకమాట మాధవుఁడు, సన్నుతిపాత్రి దివౌకసావళి
ధ్యేయుఁడు, శార్ఙ్గచక్రధర దివ్యమహాప్రతిభాఢ్యుఁ డట్టి తే
జోయుత నీలదేహుఁడు, వసుండయి మమ్మనిశమ్ముఁ బ్రోచెడున్ 4

శా. క్షీరాంభోధిజనించియు న్విజయలక్ష్మీనామముం దాల్చియు
న్హేరాళ ప్రతిభావిశేష మహితాహీంద్ర దివ్యపర్యంకగుం
డా రాజీవదళాయతాక్షు బుధగేయప్రాభవోన్మేషునిం
జేర న్సద్హృదయాబ్జపీఠిఁ దగు నా శ్రీదేవి మమ్మోమెడున్॥ 5

ఉ. ధాతయు వెంటవచ్చుఁగద, తాతనుగూడి వరప్రదాతగాఁ
ద్రాతయు నేత యాతఁడు నరాయణనాభిజలేజమందె, సం
పూతచరిత్రుఁ డుద్భవిలి, భూమి జనంబుల సృష్టిఁజేయు ని
ర్ణేత విధాతనాఁ దనరి, నిచ్చలు వేదచతుష్క వాక్కులన్. 6

ఉ. క్షీరముఁ బుస్తకమ్ము నెసఁగెంగద వల్లకి చేతులందు, శో
భారతి భారతీరమణి, భాస్వర వాక్కులనప్రచారకున్
శ్రీరుచిరత్వముం దెలుపఁ జెన్నలరారెడు విద్యఁ దెల్ప, నా
ధీర నిరంతరంబెటఁ బతి న్విడకే యిటు నాకుఁ దోడగున్. 7

చ. సరస చతుర్విధాంధ్ర విలస త్కవితావిభవాఢ్యు నెంతు, న
య్యురుతరపారసీక యవ నోత్తమ సంస్కృత హూణ కోవిదుం
బరమసుశాంతమూర్తి బుధవంద్యుని జ్యోతిష ధర్మశాస్త్ర బం
ధుర పటిమాభిరామ గుణధుర్యమహత్తముఁ బూరుషోత్తమున్. 8

ఉ. భారుణి నన్నుఁగన్న వనితామణి భవ్యపతివ్రతామణిన్
జారువచోన్విత న్నయవిచార ననారత మేఁదలంతు, శృం
గారసురూపిణి న్మహితకాంచనతుల్యను, మాన్య ముక్తికాం
తారమణి న్నిరంతర సనాతనధర్మ పథైక గామినిన్. 9

వ. ఇ ట్లిష్టదేవతా గురునమస్కారంబులం గావించినతఱి. 10

## కృత్యారంభము.

క. బలుపాడవువాఁడె కోయం గలిగెడిఫలమంద బుడుతకడఁగినపగిద్ధిం
దెలివిం గొఱవడనైనను బలువుర కెటో ముదముగదురఁబలుకఁ
దలంపన్॥ 11

క. కవిపుత్త్రుఁడఁగవినయ్యునుగవివరబుధవర్ణ్యమార్గకలికోత్తముఁడనై
భువిఁబుట్టియునొకకబ్బముఁబ్రవిమలమతిఁవ్రాయుకున్న భావ్యంబా నే?

క. ఘనబుధుఁడు జనకుఁడొనరింపనుగృతులవి కాంచినారు పండితపుత్త్రుం
డనరే ? నతఁడు, గావున మది నొనరుప నే దైనఁబూని యొకకృతిఁ
దొలుతన్. 13

క. శతకం బస్మన్మాతృస్తుతిరూపక మాచునొప్పఁ జొప్పడుఁ జెప్పన్
గతియాసని భావించుచు నతిముదమిడ ముందుకూర్పు నయ్యే
నఁటుండన్. 14

క. తోఁచెన్ ఖండకృతుల్వ్రాఁడి వాచాతీతప్రభాప భాస్వరుఁ డనసై
పాప్రిచేతసతుల్యుండౌ ప్రాచీన కవీంద్రయోగివరకృతిఁబలుకన్. 15

ఆ. పద్యగద్యములఁ బ్రబంధరూపంబునఁ దనరఁ జేయువ్వానిఁ గనినయంత
వేమనాఖ్య యోగివీరుండ కవియాచు నీతిబోధ సేయు భాతినెంచి.

క. రాయనరపుఁ గులదీపకుఁడై యొప్పిన పూర్ణయాఖ్యుఁ డస్మత్పితృమి
త్త్రాయతమతి గద్యమ్మున నీయుత్తము చరితవ్రాయ నే నదికంటిన్.

చ. ఇపుడు పురాణగాథ యెదిరోని రచించినఁ బ్రీతియేరికా ?
నుపకృతి తాఁ బ్రపంచమున కోపికఁ జేయు మహాత్ముఁ డౌట ని
క్కపుఁజరితంబు నందగిన కాలపువాఁ డతఁ డౌటఁ జేసియున్
విపులముగా నెఱుంగ నిటు వేద్యమొనర్చిన హృద్యమయ్యెడున్॥

ఉ. శ్రీయుత వేమనాఖ్యుఁడు తుకీయకులుం డవ్వఁగాక తాను రా
ధేయుఁడు దానమం దెటులొ, ధ్యేయుఁ డితండు నిదానమం దటుల్
జ్ఞేయుఁడుగాఁ జెలంగె, మహనీయుఁడు, తచ్చరితంబు 'వేమయో
గీయ' మన వ్రచింతు, బుధగేయ మమేయ గరీయ మీయిలన్.

ఉ. ఆనయమార్గ వేది మహితాత్ముఁడు వేమనయోగివర్యుఁ డ
న్మానివరేణ్యనిష్ఠిత సమంజస సాధుపథైకవర్తి స
న్మానితదివ్యకీర్తి కరుణామయమూర్తి, హతార్తిభూతవిన్
ధ్యాన మొనర్చి, తత్సుచరితమ్మును జెప్పఁ దొడంగు వాఁడనై .20

ఉ. భారతమాతకుం దొలుత భవ్యచరిత్రకు వీరమాతకుం
జేరిచి వానమస్కృతులు చె న్నలరారినవారి నెంతుఁ బ్రా
గ్భార యశోవిశేషులగు వ్యాసుని భాసునిఁ గాళిదాసుని
న్భారవి మాఘ హర్ష గణన స్భవభూతి మురారి ముఖ్యులన్. 21

ఉ. భారత మాదినేపలికి వన్నెను మిన్నవు నన్నపార్యు, నిం
పారఁ బదేనుపర్వముల నయ్యయినుద్దుల దిద్దు తిక్కనం
బూరణ నెఱ్ఱనం బొగడి, పూజ్యుల భాస్కరసోమనాథుల
న్నారెకుఁ బోతనార్యు నెద, సన్నుతిసేయుదుఁ బెద్దనాదులన్.22

క. అందఱు మాత్మస్తుతి పర నిందలపాలౌటఁ గుకవి నిరసనఫక్కిం
గందురె కావునఁ గాటుక కుం దొరకరయిరి ధరణిని గుకవుల
నరయన్. 23

ఆ. కాన నిద్ది ప్రీతిఁ గనువారికెల్లఁ గేనువినుచువాఁడ నీచరిత్ర
మనుచుఁ గావ్యకన్య కర్హుఁడౌపతియెవ్వఁ డనికొనంగఁ దోఁచె
నరయ నిట్లు. 24

## కృతిపత్యన్వేషణము.

క. మున్నల నన్నయముఖులౌ నిన్నలు కృతులిచ్చినా రమేయప్రతిభం
గన్న నరేంద్రులకిల దాన న్నుతి సమ్మాన మందినాఁగటులుండన్॥

క. పాతక మదియౌ నంచునుబోతన తా నీయఁడయ్యె భూతలవిభులం
దేతనికిని భాగవతము చేతోముదమార నిచ్చె శ్రీరామునకున్ 26

ఆ. అట్లు కొందఱిచ్చి రవనీశ్వరులకెన్న నిట్లు లేరొ యిచ్చి రీశ్వరునకు
నేనుమాత్ర మిప్పుడిం దెవ్వరికి నీయఁ జాలనైతి నద్దియేలయనఁగ॥

ఆ. భోజరాజుఁ బోలు భూకాంతులా లేరు,కృష్ణదేవరాయ కీర్తినీయ
మహితయశులు సరసమహిపులును న్లేరిఁ కాదరింతు రేరు భూ
దయితులు ? 28

తే. కానఁ బురుషోత్తముఁడె కృష్ణుఁడౌ నటన్న
నీఁకను బదియాఱువేలు గోపికలు గాక
కొసరు కవిరాజు లొసఁగిన కూఁతు లుండ
నేల యాదరమునఁ జూచు బేల దీని ?. 29

శా. మాతోఁబుట్టువు లైనప్రౌఢసతుల న్మాన్యప్రబంధోత్తమ
వ్రాతంబుం బితృకర్తృకంబును భరింపంజాలు శంభుండనం
జేతఃప్రీతిని జూచునో ముగుద నోఁచెంబో యహూ ల్బుస్సనుం
బూత లుగ్గయు గంగ దేహమున నెప్డున్నట్లిపై కెక్కఁగన్॥ 30

వ. అదియట్లుండ 31

క. కలలోఁగాన్పించెదరఁట యలహరిహరు లట్లువచ్చి యడిగినమీఁదం
గలిగినఁ జూతము వేఁడొక టలుసోఁ దనయంత నరుగ నంచుం
దోఁచెన్॥ 32

శా. ఏదోదయ్యము కానుపింపనిది లేనేలేదో! యున్నం గనం
గాదో! యట్టిదె యిష్టదంబను నెటు లక్షించి తాఁజెంచి, వి
ద్యాదానం బొనరించి మంచు గురుని ధ్యానించి సేవింప నే
దేదైన న్నాస్పది నెంచుమాత్రమునఁ బ్రాపించుంగదా యేరికిన్ 33

శా. 'ఆయేదో ఫలదంబటంచు వినలేదా'? యందు రే న్వింద రే
ధ్యేయంబా గురురూపమందు నదిలేదే స్వర్గం బెట్లగున్?
భూయఃకల్పిత వందనాదికముల న్బొందింపఁ దద్బుద్ధితో
డాయ న్వచ్చి తదాకృతి న్ఫలము రెంటం గూర్చు టబ్రంబొకో!

క. ఆదరమున నాకృతిఁ గనఁగాఁదగుపతియెవ్వఁడన్నఁగనుసామయుఁడు
నోసేదారుఁడు మజ్జనకుఁడె కాదే గురుఁ డతఁడ నాకుఁ గనఁడే
ప్రీతిన్? 35

చ. తనయులపల్కు లెన్నఁగను దప్పులకుప్పలె యానుగాక, యె
ట్లును ముదమిచ్చుఁదండ్రులను, లోలతఁజెంచుసహించుఁగావునన్
జనకుఁడె ప్రీతిఁ గాంచఁగ నిజాత్మజ సత్కృతికన్యనిత్తు, నా
తనికిఁ గవీంద్రశేఖర బుధప్రవరోత్తమ వర్ణ్యబుద్ధికిన్॥ 36

తే. ఇపుడు కౌమారదశయందు నెసఁగునతఁడు
నాదు జననియొ, దివికేగ నాదుకొనుచు
మోద మిడ వార్ధకమ్మున నాదుహితయొ
తప్ప లేరేరు దరిఁజేరి మెప్పుఁగూర్ప॥ 39

క. సోదరులు లేరు నాకిఁక సాదంగా నతనిఁజేయ సానందాత్మన్
మోదంబిడ నిహపరముల నాదుకొన న్నన్నమ్మ నాతఁడకాదే!

తే. కాన నాతనికే కృతి యే నొసంగ
ననుపమానందుఁ డతఁడొట యట్టులుండ

వన్నె కెక్కను ముగ్ధమై యున్న నిద్ది
దాన నేనును దరియింప నాను గాదె. 39

క. గురుఁడె బ్రహ్మయువిష్ణువుగురుఁడెమహేశుండటంచుగురుఁడేసాక్షా
త్పరదైవత మనియనరే? గురుఁడనఁగానట్టిఁడౌటగురున కెయిత్తున్.

క. గురుభక్తి న్నపద్ధరనరుఁ డెట్టిఁడుముక్తినందు న్యాయ్యంబకడా
వరమహాఁగదప్రీతిమొయినినరునాతనిఁజేయఁగావ్యవరమునకిపుడేన్.

తే. కొండ తలక్రింద నుండంగ గులకశాల
కొఱకు నేడనొ వెదకంగఁ గోరుకన్నఁ
దెలివితక్కువ వేఱుండఁ గలుగునొక్కొ!
అట్టిదేకాదె! గురువీడి యరయుటయన. 42

తే. మఱియును బిత్రాణ మెన్ని జన్మముల నెత్తి
యైనఁ దీర్పఁగ శక్యము కానిదయ్యె
నట్టి దొక్కింత యేనిప్పు డిట్లుతీఱు
మార్గ మొసగిన నెటు లపవర్గ మబ్బు? 43

క. నరమాత్రులునరపాలురుసరసులు గారెఱుఁగఁగృతులసారస్యంబున్
హరిహరు లోమాటాడరుగురువరుఁడో బుధుఁడు తెలుపుగుణ
దోషంబుల్॥ 44

క. కావున సర్వవిధమ్ములఁ భావిశ్రుతపుణ్యమూర్తి పురుషోత్తముఁడే
కావ న్ననుఁ,మత్కృతికన్యావరుఁడై యేలనర్హుఁడౌనెటులరయన్.

క. వేమనపద్యము లన్నియు ధీమంతుఁడు మధురుండె దిద్దెనుగాదే
నీమమ్మున నేని ప్పిటు లామహితు చరిత్ర వినుపనతనికిహితమా.

చ. అభినవదండి కేతనసమాహ్వయసత్కవి తిక్కయజ్వనా
మ భజనసేయఁగా దశకుమారచరిత్ర మొనర్చె నంకితం
బభినవతాప్తి నా కొదవదైనను దిక్కన సాటిమేటియా
నభినవవేమ రంగగురుఁ డాపురుషోత్తముఁ డేలు నీకృతిన్. 47

వ. అని కృతనిశ్చయుండనై నారచించు నీ 'వేమయోగీయము'
న్పురుషోత్తముండౌ పురుషోత్తమునకే యంకితంబుగా రచింపంబూని
తొలుత నస్మత్కృతినాథు వంశావతా రాత్కృష్ట్యాదు లెంతుసల్లన్న.

## వంశావతారము.

మ. ధరణి న్విప్రకులీను లై విహిత వేదవ్యక్త సన్మార్గులై
హరితర్షి శ్వరగోత్ర జాతులనఁ బ్రఖ్యాతాన్వవాయంబులన్
వఱలంజాలిరి భారతావనిఁ గృతాపస్తంబసూత్రోక్త భా
స్వరకర్మాన్విత వైదికోత్తముల శశ్వత్కీర్తివర్ధిష్ణులై। 49

తే. వారలందగు వెలనాటివారి శాఖ
యందు 'నాదెండ్ల' యనుపేర నలరునూర
వరతపోధనుఁ డైనట్టి పరమపూజ్యుఁ
డరియ నరసింహభట్టను నతఁ డొకఁడు. 50

ఉ. ఆతఁడు నిత్యనిష్ఠను జపాచరణం బొనరింపఁ జేరెఁ గృ
ష్ణాతటిసితటాంచల విశాలవనావృత కీరశారికా
గీత మనోహరానిల వికీర్ణ తరువ్రజ పుష్పరాగ సం
ఘాత జనాతపార్తిహర కమ్రవిలేఖ్య వనప్రదేశమున్॥ 51

క. మహి సీతారామపురా గ్రహార నామంబున నది రాజిల్లె నట
న్మహితనరసింహమునిచేయ హవ్యకవ్యములతిథిజనాదరణంబున్॥

క. నాగేశ్వరుఁ డుదయించెను భోగీశ్వరసన్నిభియు పుణ్యచరిత్రన్
ద్యోగీశ్వరుఁడనన్నై నిగమాగమవేత్తృత్వమబ్బనసముఁడునాఁగాన్॥

మ. దరహాసాంచితవక్త్రుఁ దత్తనయుని దైవజ్ఞచూడామణిం
జిరసంపాదితసద్యశోధనుని భస్మీభూతసర్వాఘు, ని
ర్జరతుల్యావనిపాల సేవిత పదాబ్జాతద్వయు న్వేంకటే
శ్వరసిద్ధాంతిని మించువా రలరిరే సర్వంసహం జూడఁగన్? 54

శా. బ్రహ్మిష్ఠు ల్సుతు లిర్వు రాతనికి సభ్యస్తాగమజ్ఞాను లై
బ్రహ్మన్నిహ్మ నిరాకరింపనవు సత్ప్రాగల్భ్యముం గాంచుచున్
బ్రహ్మానందముఁ గూర్చి రాపితకు శంభ్వబ్జాక్షు లట్లొప్పి, సు
బ్రహ్మణ్యాహ్వయ కృష్ణనామ మహితప్రజ్ఞాయుతు ల్ధీయుతుల్.

క. అం దగ్రజుఁ డలభూమీ బృందారక బుధవరేణ్య బృందామందా
నందద మందారము గురు వందారుఁడు సుబ్బయార్య వరుఁ
డెన్నంగన్ 56

తే. కాలినడ నేగి నిరుమార్లు కాశి కతఁడు
నంత రామేశ్వరమ్మున కట్టులెచనెఁ
బట్టుదలనెన్న నాతండ దిట్టసుండు
పట్టి కామార్యుఁ డుదయించెఁ బ్రథితయశుఁడు. 57

సీ. కామయాభిఖ్యాతి కమనీయవిఖ్యాతి
సత్కవ్యలేఖ్యాతిశయ విభూతి
స్తుత్యార్చితజ్యోతి నిత్యకర్మప్రీతి
హోమపవిత్ర ధూమాతిధూమహేతి
నిగమాగమాధీతి సుగురుబోధ్యజ్యోతి
పామృతిసారతిహాసరీతి
ప్రాప్తాపవర్గాతిపథగమ్యనిర్ణీతి
దివ్యప్రభాపీతి ధీప్రసూతి

తే. నీతి సూరిస్తుతిస్ఫీత నియతవృత్తి
విత్తి వాచస్పతిజ్యోతి విప్రవృత్తి
వృత్తి వ్యావృత్తిపాత్ర ప్రసత్తి సత్తి
బత్తిని బ్రపత్తి వివిపత్తి బుత్తి ముత్తి. 58

ఉ. కాంచిన మేరునీపుని దిగంతర నిర్మల కీర్తి చంద్రికా
కాంచనదేహకాంతి జిత కామ జయంత వసంతరూపుఁ గా
మించి వరించి మించె నలమించును మించినసుందరాంగి స్తు
త్యాంచితభావ సద్గుణకదంబ యనందగు సుబ్బమాంబ తాఁ ॥59

క. వారిర్వుర కుదయించిరి ధీమలు సూనులు తనయు లుదీర్ణప్రతిభుల్
శ్రీరుచిరాకృతివిలసితనారీమణు లైనసుతలు నవ్యగుణాఢ్యల్ ॥60

క. ధరఁ బుట్టిన హరిహరులో 'నరనారాయణులో' యనందగి రందు
న్వర సుబ్రహ్మణ్యేశ్వర పురుషోత్తమనామ వేద్య బుధజనగేయుల్

క. వా రిర్వురనెయ్యమ్మది శ్రీరామానుజులదైన చెలిమింబోలెన్
దీ రరయఁగ ధర్మజనర వీరాభులు వార లనఁగ వెలసిరి భువిలోన్

తే. అట్టివారల నగ్రజుఁ డైనయతఁడు
బుధవరేణ్య సుబ్రహ్మణ్య పుణ్యగణ్య

వర్ణ్యచరితుండు మహితుండు వరగుణుండు
గురుఁడుఁ బ్రేమాకరుండు సోదరున కగుచు. 63
తే. దక్షిణామూర్తి సన్మంత్ర దానమొసఁగె
దానఁ గవితావిధాన సంధానగరిమఁ
గాంచి, "పితృసమో జ్యేష్ఠ" యటంచు నెంచి
యాజ్ఞ మీఱక వర్తించె ననుజుఁ డితఁడు. 64

## కృతిపత్యభివర్ణనము

సీ. ఆంగ్లేయపారసీకాంధ్రగీర్వాణ హిం
దూస్థానభాషా బుధుండు దవుచును
వరచతుర్విధ కవిత్వప్రౌఢి సద్గ్రంథ
ములఁ గూర్చి యవధానములను దవిలి
భవ్యహిందూస్థానభాష ముప్పదిరెండు
నాటకమ్ముల వ్రాసి సాటిలేని
దైవజ్ఞుఁ డననొప్పి శైవాలయము దీవి
సీమ కోడూర నిర్మించి మించి
తే. యుచిత మగుసుఖ్యాతి గడించినాతఁ
డలరు నాగెళ్ల పురుషోత్తమాఖ్యుఁ డనఁగ
సుగుణుఁడు మహితుండు ధీమ ద్విభుండు
సజ్జన నుతుండు ఘనుండు శాంతుఁ డనని॥ 65
సీ. రమ్యాద్భుతోత్తర రామాయణ సుశుభ
కీర్తి ప్రభావంబులుఁ గృష్ణమహిమ
మొదలౌ ప్రబంధము ల్వదిరెండు నభివర్ణ
నావళి పదియాఱు నాంధ్రయవన
నాటకమ్ముల నెన్న నలుబదొక్కటి కబ్బ
ము లిచ్చిన్న వెన్నియో బుడుతలకును
బ్రకృతిరూపప్రకాశికయు వికృతిరూప
చంద్రిక తెలుఁగున సంస్కృతమున॥

తే. నన్యరూపదీపికయన నలరునదియు
వెరసి మూడునిఘంటువు ల్సరవి నింక
బుధవిధేయినిసంచిక ల్పదిపదులును
వ్రాసినట్టి శతాధికగ్రంథకర్త॥ 66

సీ. బాలకావళిఁ గూర్చి పాఠశాలను జేర్చి
నీతిబోధ లొనర్చు నిపుణతముఁడు
జాతకమ్ములఁగాంచి గ్యోతక మహ్మానట్టు
లాగామిఁ దెలిపెడి జ్యోతిషికుఁడు
ధర జనమ్ములలోని తగవులెన్నియొ మాన్పి
తగవుఁ దెల్పఁగఁజాలు ధర్మవిదుఁడు
నిరుపాధికులు నూరు లరుదేర నయమున
ధనమిచ్చి యిప్పించు దాతృవరుఁడు॥

తే. బుద్ధిగీష్పతి యసదృశబోధకుండు
శుద్ధవిజ్ఞాని నిరుపమశోధకుండు
శ్రద్ధధానుండు నసమానస ఫలుండు 67
సిద్ధచరితుండు మహనీయుఁ డీతఁడుండు

తే. ఓర్పు నోపిక యొద్దిక నేర్పుఁ దీర్పు
వినయము నయంబు ననయంబు వినుతములయి
ఘనతఁ బెంపొందఁ జేయంగఁ గనదనూన
శస్తకీర్తి నెసంగెడి సాధు వితఁడు॥ 68

శా. భూతానాగత వర్తమాన విషయంబుల్దెల్పు దైవజ్ఞుఁడై
జ్యోతిష్యుక్త కలాకలాపములఁ బ్రజ్ఞావైదుషీ శేముషీ
చాతుర్యమ్ముల వెల్లడించి వివిధాశావ్యాప్త సత్కీర్తిని
ఖ్యాతుండయ్యెను బూనుకోత్తముఁ డనన్యప్రాప్త నైపుణ్యుఁడై॥

ఉ. ఇమ్మహి నాంధ్రకావ్యముల నెందును జూచిన సాటిలేని ప।
ద్యమ్ముల బంధగర్భకవితాద్భుతిఁ జూపుచు హిందిభాష లో
కమ్మున వన్నెకెక్కఁగ నఖండుఁ డపూర్వపురూపకావళి రం
గమ్ముల నాడఁజేసి, కవిగాయక కీర్తిత సచ్చరిత్రుఁడై॥ 70

ఉ. చక్కని నాగ్విశాలతను సాఘు మృదూక్తులకూర్పు నేర్పున
న్నెక్కు అలంకృతు ల్సవిణపేయము లౌఁగతి. జెప్పచొప్పన
న్నిక్కపుభక్తియుక్తి ధరణీస్థలి నీతిఁ దనర్చువైఖరిన్
ధిక్కృతతిక్కయజ్వగ సుధీవరవర్ణ నమీాతఁడందఁడే ? 71

మ. విపులప్రజ్ఞుఁ డితండు పల్కుకృతు లుర్వి న్నాటిలేకుండు, వ్య
ర్థపదం బేడను గానరాక బహుళార్థద్యోత కాచ్ఛప్రబం
ధ పరిష్కార సమన్వితంబులయి విద్యాప్రౌఢిమం జూపెడు
న్విపశ్చి త్తోత్తమబంధగద్యకవితా విస్ఫూర్తి సంకీర్ణముల్॥ 72

శా. ఆపద్బాంధవుఁ డీతఁ డానఁగ వైద్యప్రక్రియ ల్నేర్చి యే
రాపన్నుల్తనుఁజేరి కోరిన, సహాయార్థంబుగా నేగుచు
న్బ్రాపై యాపద మాపఁజూపెడిని లోపం బేరి కెందుండినన్
దీపం బంధతఁ బాపఁజాలునటుల న్దిగ్వాంగ నుంకించకన్॥ 73

తే. శ్రీరఁ "బగోపకారార్థ మిదంశరీర"
మనెడునార్యోక్తి నెఱుఁగ నవతరించెఁ
దాను జూనను బూరుషోత్తముఁడ యనఁగ
సార్థనామ్నను వెన్నెంగు సజ్జనుఁడు॥ 74

క. దేవనగరాత్తముల న్దా ఖిద్య ద్విపప్రాపెఁ దగునీతి న్సం
భావన మొనరుచుచుండెను పావనుఁ డాతండు తానెపండితవరుఁడై॥

తే. గురుఁడు పురుషోత్తమ హితాచ్ఛగురుయశుండు
ధర్మగుణకర్మ నిర్మాణ మర్మవిదుఁడు
గురుఁడు పురుషోత్తమహితాచ్ఛ గురుయశుండు
ధర్మగుణ కర్మ నిర్మాణ మర్మ విదుఁడు. 76

క. పురుషోత్తమ చరితమ్మనఁ బురుషోత్తమవర్ణనీయ పురుషార్థదమై
పురుషోత్తమ చరితమ్మనఁ బురుషోత్తమవర్ణనీయ పురుషార్థదమై॥

శా. సారాచార నయప్రచారపథ సంచారైక చారుక్రియా
సారోదార విచారసారుఁడు దశాశావ్యాప్త సత్కీర్తి వి
స్తారుం డాశ్రిత సూరివార బహుళోత్కంఠాఘసంధాన మం
దారుండై తగు పూరుషోత్తమకవీంద్రగ్రామణి శ్రీమణీ 78

## నిజ మాతృ దేవి

క. చేపట్టిన నారీమణి యోపనులను దాసిమంత్రి యోజించుతఱిన్
రూపమ్మునఁ దా రమ క్షమనై పుడమి జనని పెరిమ శయనరం
భయునై॥ 79

క. ఘన జమ్మలమడకాన్వయమున సీతారామనామ భూసురునకిలన్
దనయుఁడు లక్ష్మీనారాయణశాస్త్రి యనంగ నొప్పునతఁ డల
రంగాన్॥ 80

క. ఆలలిత తత్త్వ విద్వన్మాళికి సతి రాజ్యలక్ష్మమకు సుతయై ల
క్ష్మీలావాణ్యాంచితయై కాత్రె న్నుతిఁబూత ముక్తికాం తామణి
నాన్॥ 81

సీ. తనతండ్రి సంతతాధ్యాపిత ప్రస్థాన
భాష్యత్రయజ్ఞాన భవ్యసుమతి
తనతల్లి భర్తృసేవనలబ్ధ వేదాంత
విజ్ఞాన సంపూత విమలచరిత
తనయత్త లోకజ్ఞతా సాధుశీలతా
సంపూర్ణ కరుణార్ద్ర సత్స్వభావ
తనభర్త దక్షిణాస్య నిరంతర ధ్యాన
సంప్రాప్త బహుకలార్జన మనీషి

తే. తాను సార్థక ముక్తికాంతామతల్లి
తల్లి కెనయైన విద్యానిధాన మనఁగ
మనఁగలిగె నత్త చిత్తరంజన మెసంగ
సంగతోత్తమ పతిభక్తి సంయుతాత్మ॥ 82

క. పాతివ్రత్యమునందిల నాతన్వి న్నోర్చల రతిన లారయ నేరుం
ప్రీతి న్నీతి న్ఖ్యాతి న్జాతిసతు ల్దీటుగారు లావణ్యమునన్॥

క. ఉత్ప్రేక్ష లేదొకింతయుఁ దత్ప్రాశస్త్యంబు నెన్నఁదరమే మనకున్
సత్ప్రాభవముం గాంచెను దత్ప్రాగల్భ్యం బతిధన్యతఁ గూర్పన్॥

తే. ధర్మమార్గైకవేదిని ధర్మపత్ని
మర్మ మెఱుంగనియిల్లాలు మహితచరిత
కర్మములఁ దోడుపడు చెంచు ఘనతఁబెంచి
నిర్మలంబైనహృదయంబు నెగడుసాధ్వి॥ 85

## కవితా సంబోధనము

మ. తనరంగాఁ బురుషోత్తమాఖ్యకవి శాన్తా ముక్తికాన్తామణీ
తనయుండం గవితాధురీణుఁడను మేధాదక్షిణామూర్తిశా
స్త్రిని, విద్వజ్జన పాదజీవనజ నర్తిం గీర్తిమన్ముఖ్య వే
మనయోగీంద్రచరిత్ర మేను రచియింపంగాఁ గవిత్వాకృతీ !
శా. సంభావించితి నన్నుయాచితముగా సంపర్కముం గోరుచున్
రంభోరూ! జితరంభ ! యెల్లయెడఁ బ్రారంభంబునం జూపునీ
గంభీరోత్తమవాక్ప్రచారములతోఁ గైసేసి యత్యంత సం
రంభోత్సాహ పరాక్రమస్ఫురణ దేగంజూచికో బిమ్మాకృతిన్॥

## షష్ఠ్యంతములు

ఉ. శ్రీవనితానువర్తికి వశీకృతశైవకృపా కృపాణ ని
చ్ఛేదిత పూర్వజన్మకృత శేష విశేష విపత్ప్రపంచ దో
త్పాదిత దుర్భరార్తికిఁ బ్రబంధసునాటకకర్తృతాది సం
పాదితభూరికీర్తికిఁ దపఃపరిపూర్తికి రమ్యమూర్తికిన్. 88
ఉ. శాంతగుణైకమూర్తికి దిశాంతవిరాజిత దివ్యకీర్తికిన్
దాంతివిశేషభూషితనితాంతముదావహ దక్షిణాంగ దై
త్యాంతక పాదయుగ్మ విధృతాంతర నిర్మలసద్ధృదబ్జ వే
దాంత రహస్యవేత్తకు ననంతపరోపకృతి ప్రశస్తికిన్॥ 89
ఉ. ధీకవితాచమత్కృతి కుదీర్ణయశశ్శరదిందుచంద్రికా
శ్రీకమనీయ చంచదధరీకృత సత్కవిరాజకీర్తిక
స్తోకబుధోత్తమోత్తమ వచోవిలస త్పురుషోత్తమోత్తమా
ఖ్యాకునకు న్సమర్పణముగా రచియించెదఁ నీప్రబంధమున్ 90

### ఇది యవతారిక

# శ్రీ వేమయోగీయము

## ప్ర థ మా శ్వా స ము

క. శ్రీపురుషోత్తమనామా కాపురుషాధమవిరామ కామాపహ సే
వా పరతంత్రకవీట్సోమా పరమోత్కృష్టకామ భవ్యోద్దామా!
వ. అవధరింపుఁడు 92

## పు ర వ ర్ణ న ము

మ. పరఁగు న్భారతభూమి నొక్కెడఁ గుభృ ద్వ్యగ్రప్రదేశాంచి తాం
బర చుంబి ప్రతిబింబి తామరసతీ వక్షోజసీమా నట
త్తరళోత్కీర్ణ మణిచ్ఛటాకటక సౌధవ్రాత నిర్యాత సుం
దర నవ్యాయత పట్టణం బది కుభృద్వ్యగ్ర ప్రభాధామమై॥ 93
చ. తనరు ననేకభూరుహవితాన ముదానహ మైనచోటఁ బా
వనమగు కృష్ణవేణిదరి వర్ణితమైన త్రిలింగమధ్యమం
బున శివలింగమై యున నభోమణిమండల మంటునట్టి కుం
డిన ధరణీధరంబునందు నిస్తుల రాజనివాస భాసమై। 94

ఉ. భాసురకాంతి ధిక్కృత దివాకర వహ్ని సుధాకరేక్షణా
వాస విలాసలాసిత సవాసనఘాత నగాధిరాజ కై
లాస కలాకలాప విగళ న్మణిమండిత మండలాంచిత
శ్రీసమ రాజితాగ్ర నగరీగరిమంబునఁ జెన్నుమీఱునై॥ 95
తే. కొండఁ గట్టినవీడౌటఁ గొండవీడుఁ
గుండినాగ్రమునందునిక్కఁ గుండినంబు
ననెడిపేరుల నలరారునట్టిదౌచు
నన్నిమీఱినదై యొప్పు వాసిచొప్పు॥ 96
తే. వెండికొండనుమించిన దండికొండ
యండమైయుండ నట నేలుచుండు ప్రభులు
ప్రతిభ మించిరి కైలాసపతిని మతిని
మంతుఁగాంచినవార లమందగతిని॥ 97

సీ. దుస్స్వర్ణమయమైన యుర్వీధర మదేల?
యిది సువర్ణమయ మహీధరంబు
రావణుం డొకచేత లేవనెత్తెరుదాని
రావణుం బిడు నిది లేవదాట
తద్గ్రిజరాజాప్తు తలనెక్క నొకరాజు
రాజాధిరాజులే రాజులీడ
నెక్క నెద్దొక్కఁడే యీసరునకునిక్క
గజ తురగసహస్ర గరిమ మించు
బూదిఁ బూసి కపాలి ముష్టికై వెడలంగ
భూతి కెక్కు లు పెక్కు దాంత లిటను
బాణు వాకిటను గావలియుండ సాంబుండు
బాణహస్తులె ద్వారపాలు రిచట
నుమయుండ జటగంగ నొర్తుని నిల్పెను శంభుఁ
డేకపత్నీవ్రతు లిందనఘులు
ముక్కన్నుఁ డెలచెడి ముక్కోపి నామారి
శాంతమూర్తు లి టేల శస్తగుణులు
తే. తానె యొకస్త్రీల దూరె నశానుఁ డతఁడు
కుండినపురీశకీర్తి యఖండమాచు
దెసలకుంబ్రాఁకి యెల్లెడఁ జెల్లవాఱఁ
దనదు గిరివాహనంబులే కనఁబడమిని. 98
ఉ. భారతమాత కంచుకము పచ్చని దొంటు ధరింప సందులోఁ
దోరపుగబ్బిగుబ్బయనఁ దోఁచెడి కుండినభూధరంబు శృం
గారవనాన్వితంబు పయిఁ గప్పిననీలముకూల మట్టిదె
చారుతరాంబరంబు విలసన్నవశోభల నీనుచుండఁగన్ ॥ 99
ఉ. భూమికుచాగ్రమోయనఁగఁ బొల్పెసలారఁగ భాసమాన శో
భా మహితేంద్రనీల మణిమండిత సద్విభవాభిరామమై
ధామ కృతోత్తమావనిపధామ సుధామయ ధామమొప్పెడి
ధ్ధామ సుధామ శత్రువసుధా మహిళాధమ ధామభీమమై॥ 100

మ. పరిఖాభీలము భూధరోన్నత తర ప్రాకారవారమ్ము గో
పుర మంటంగలగోపురమ్ము మహితమ్ము న్మత్త దుశ్శాత్రవే
శ్వర దుర్భేద్యము దుర్గదుర్గమముగాఁ బ్రాసాదశోభాయుతం
బురుతేజోయుత రాజధాని తగు సర్వోత్కృష్ట నిర్దిష్టమై॥ 101

ఉ. ఏనుఁగు లానగేంద్రమునకే జనియించిన కొండగట్టులో
నా నలరారుచున్నవి ఘనత్వ మహత్త్వ పటుత్వసంపదన్
మేనుల పొందికంగనఁగ మేరువుఁ గేరెడి లీ రెసంగు గం
గానదికై కరంబిడి పెనంగొని లాగ సువర్ణకాండముల్॥ 102

ఉ. ఘోటకరాజసంతతు లకుంఠిత బాహుపరాక్రమాఢ్య వా
చాట వరాటక ప్రకట శత్రువిదారణ దారుణాస్త్ర సం
స్ఫోట విశంకట స్ఫుటన భూభృ దశేషభటాధిరూఢముల్
వీట నెసంగెడు న్బవనవేగము మించుచు వేగులం చనన్. 103

చ. సరసిజసంభవుండు కలుషం బొనరించుటఁ గోలుపోయెఁ దా
శిర మొకఁడంచు నాతనిఁ ద్యజించి సరస్వతి యేగుదెంచి త
త్పుర ధరణీసురాత్త గుణపుంజ వినిర్మల కీర్తివిశాలుగం
దిరవు ఘటించికొన్న దననేర్పెఱిఁ ద న్నిగమాగమజ్ఞతన్॥ 104

ఉ. చెన్నువహించి తత్ప్రభులు శిష్టజనావన దుష్టశిక్షల
న్నెన్నికకన్న మిన్నయవు విన్ననువుం గనియున్నవారలో
సన్న నెఱుంగి వారికిఁ బ్రసన్నమతి న్నుతియయ్యె భూమి, ద
ర్పోన్నతి వార లంద మహిమోన్నతిఁ దాను వహించె ము
న్నిటన్॥ 105

చ. కలుములబోటి కాపురము కాపుర మర్త్యసతీజనావళి
న్బలువుగ భర్మభూషణవిభాసిత సుందరవిగ్రహాఢ్య శో
భలఁ దనరారఁజేయుచు శుభప్రద కార్యపరత్వబుద్ధి నె
ప్డిల జను లొప్పుఁజేసెడి నహీన సుదాన నిధానసంపదన్. 106

ఉ. భద్రద కార్యనిర్వహణ భద్ర మనో వినయప్రచార సౌ
భద్ర పరాక్రమాఢ్య బలభద్రసమాన సుబాహుశక్తులై

భద్రసమృద్ధులై తగిరి భద్రపదాంబుజ భక్తియుక్తులై
భద్రసురాహతి ప్రథన భద్రసమాగ్రజ భద్రశూరులై॥ 107

సీ. 'భ్రమరము ల్వ్రాలని పద్మముం గను'మన్న
మొగముపై నివె లేవె ముంగురులని
'కుందకుట్మలము లేడందగునొక్కొ' నా
నచ్చుఁ జూపంగఁ బలువిచ్చి సాగెడి
'మంకెనపూ వేడ మంజువాణీ!' యన
'మంజువాణినె' యను మంజుళముగ
'మంజరీ! యి' మ్మనమంజరీ హ్వాతయుమ్మ
'మంజరి కరము కొనంజను' నను॥

తే. కలువ లడిగినఁ జూపెనీఁ గన్నుదోయి
సంపెగ యడుగఁ జూపు నాసాపుటమ్ముఁ
బూవు లమ్మెడి యాపీటె పూపుబోఁడి
సరససల్లాపములఁ బాంథు సరసుఁ గలిసి॥ 108

సీ. అల్లిక సిగఁజుట్టి మల్లెపూవులఁబెట్టి
సన్నచీరనుగట్టి సానిఁబట్టి
తమ్మల మ్మెడనోటఁ దావి యత్తరుచాటు
గడుసనే తగి బాటఁ గాచివీట
యువకులే రసదేర సవరించికొని చీఁక
జిలుగుసగపులఁ జీఁకఁ జెల్మిఁ జేర
నచ్చువలనుజక్క మచ్చుళోఁబడినక్క
వాకిట నొక కుక్క వఱెలు స్రుక్క॥

తే. గర్వ మడఁగించి పొగరెద సర్వమడఁచి
పీల్చి యొంటనింటను వానిఁ బిప్పిఁజేసి
జోగిఁజేసియుఁ దుదను బైరాగిఁజేసి
విడుచు నచ్చోటి వెలబోటి వెతలమాటి॥ 109

వ. ఇట్లఖిల సంపద్విశేషాకరంబై యనవరతశోభాకరంబై తత్తత్సమాగతానూన శ్రీకరంబై కరంబుఁ జెన్నువహించు నప్పురవరంబు,

## వేమనబాల్యము.

మ. ఒకనాఁ డాంధ్ర యశోవిశాలతను సర్వోత్కృష్ట నిర్దిష్ట నా
యకతం గాంచిన రెడ్డిభూమిపులతావై పేరిమి న్నిర్మలుటన్
సకలైశ్వర్యనిధాన మద్ది యనునాసం జేర వార్వీరు నాఁ
టికిని న్నేఁటికి సాటిలేని దగువీటిం జెప్పఁగా నేటిదై॥ 111

ఉ. రెడ్డికులీనులందు భళిరే! ధనసంపద దానశీలతన్
సడ్డయు బత్తికల్మిఁ గలుషాపహ సత్యవచఃప్రభావ్యతన్
దొడ్డయశంబుఁ గాంచిన ఘను ల్గలవీడని యాడఁజేర నే
ర్పడ్డకుటుంబము ల్దనర, వారల నొక్కఁడు వేమనాఖ్యుఁడై॥ 112

చ. జననము నందినప్పుడె ప్రజాతకుఁ బ్రీతకు మాత కాతటన్
జనకునకు స్వమస్తజన సంతతికిం గన నేత్రపర్వమా
ననుపమరూపసంపదకు నాకగమై కర మింపుమీఱు వి
స్ననువున నన్నయన్న విగతాత్మజ యెన్నఁగఁ గన్నదన్నమైన్॥

తే. తల్లికన్నను గారాముఁ దా నొనర్చి
ముద్దుమఱఁదిని దరిఁజేర్చి మురియుచుండె
నెత్తికొని యెప్డు క్రిందఁ గా లిడఁగనీక
యేమికోరినఁ దెప్పించి యిచ్చుచుండె॥ 114

తే. కనినమోహముకన్నఁ బెంచినదె యెక్కు-
డన్నమై నన్నభార్య వేమన్న నెపుడుఁ
బెంపుడుకుమారునట్టులఁ బ్రీతిఁగనుచు
నెత్తునను బొత్తునను బెంచె నెంతయు తమి॥ 115

తే. కలిమికలిమినె చదువబ్బఁ గలుగు టరుదు
గాఁగ గారాము జతపడఁగా నిఁకేమి?
గాలిపటముల నాటలఁ గాల ముడిగె
సాములనుమేటి తానయ్యె సాములందు॥ 116

క. తా నాడినదే యాటగఁ దా నెయ్యది పాడఁ బాట తందన యనమిన్
బోసాడునో యనిపించంగాఁ స్వాతంత్ర్యవీథిఁ గనఁబడుచుండెన్॥

తే. కాని యున్నటిఁ బరికించి కాంచుచుంట
'మకురుపా' లైనను నిసర్గమార్గనమ్ము
కొంతయుంటయు, దుష్టులఁ గూడకుంట
సుగుణ మనుకొంగ యౌవనశోభ తనర। 118

ఉ. వేమన పాపదూరుఁడు పవిత్రపురాకృతపుణ్యశేష మిం
కేమియొయుండి తా ననుభవింపఁగ మాతృసుగర్భశుక్తిము
క్తామణినా జనించె మహిత పరిధిత ప్రఁఖ్యాత ప్రతీక్ష్య లో
కామితసుందరాకృతి వికస్వర సుస్వర భాస్వరుండుగాన్. 119

క. ఆగర్భ శ్రీమంతుఁడు త్యాగమ్మునఁ బేర్మిఁగాంచు నట్టిఁడు తానై
భోగమ్ముల కిరవొందన్ రాగమ్మున సఖులు వొగడ రంజిలు
నెడలన్॥ 120

## వసంతర్తు వర్ణనము

ఉ॥ అల్లవసంతకాలమున నల్లన నెల్లజగంబుఁ జూడ, సం
ఫుల్లతఁగాంచి మించుచు నభోంతగమంతయు వింతవింతకాం
తు ల్లలితమ్ములై మెసఁగ దోసాలదామిత చారుపల్లవ
ప్రోల్లసితమ్ములై తగఁ దను, ల్లసుకేళిని జంతుపాళియున్. 121

చ. వనతరుశాఖలందు నవపల్లవభక్షణముం బొనర్చుచుం
గనఁ గడుఁ బోతరించిన శుకంబులును న్పికశారికావళుల్
వినవిన నింపు నింపుసన పీనులసొంపు దలిర్పఁ బాడుచున్
జనముల నెట్టివారికిని స్వాంతముల న్గరిగింపఁజాలెడున్. 122

ఉ. కొమ్మలు పల్లవాధరలు కోమలపల్లవపాణులై తగన్
గమ్మనితావిఁజిమ్ము సుమగంధులు నోచు లతాంగులై యిలం
గొమ్మలు పల్లవాధరలు కోమలపల్లవపాణులై తగన్
గమ్మనితావిఁ జిమ్ము సుమగంధులునోచు లతాంగులై యిలన్॥

ఉ. మాధవుఁడుఙ రమాధవకుమారుఁడు మారుఁడుఁ జేసి తారు తా
రాధవుతోడినెయ్యము తిర మ్మల కొమ్మలపై వసించుచుఙ
సాధకులోచు భూజనుల సాధువుల న్దయమాలి ప్రోధపు
న్బాధల ప్రుక్కఁజేయుదురు పంచశరమ్ముల నెక్కువెట్టుచున్॥

క. వసతుల వసతుల వసతులు వసతులు గావని వసంతవనవాటికలఁ
వసినసి మేలని వసిగొని వసంతు వసమున వసింప పచ్చెడి జంటల్

తే. వసరమాధవ మాధవ తనయులకును
దేరు తానన్న తీరన్నఁ జేరుసన్నఁ
బగు వసంతమ్రమాఖ్యఁ జాతమ్ముఁ బికమె
సంగు బంకై యనంగ వసంతఘోషి॥ 126

ఉ. భావముదానవహం బఖిలభావవిభావము భాసభావినీ
భావము, భావిభావుకము, భావితభావము, భావభాసురం
బై వసుధాతలంబెసఁగు నంగజసంగతశృంగమో యనం
గా విడియన్ ద్విరేఫగన కార్ముకనాద విశీర్ణ తూర్ణమై॥ 127

వ. ఇట్లకాలపురుష యౌవనప్రాదుర్భావంబును జతపడిన యెడ
వేమన్నకు 'విశ్వదాభిరామ' సమాగమము.

మ. పరిభలన్ గ్రక్కి శిసుస్కుఱా స్వదినె కూర్పంగోర నేర్పాటుగా
నభిరామాఖ్యుఁ స్వర్ణ కాయుఁ డవిసేయం దేరఁ దా నేగుడున్
శుభగాత్రి న్రతిసన్నిభ న్యువతి నయ్యేఁ గాంచె నొక్కర్తు సౌ
రభ మెచ్చ న్గగుమెచ్చ ముక్కుఱఁ గన నంజిల్లు చిత్తంబుగాన్

మ. నవలా కా దభిరామునిర్మిత మిదండంబైన యేబొమ్మయో
యపుచో నేమది ప్రాలఁ దుమ్మెదలు గుంపై పద్మముం జేరుటా?
మెదియో మీలెగఁ బ్రాఁకనయ్యేడినె? కానేకాదు, మీనాక్షి తా
హావణించున్ రవణించు మించుమెరుఁగు బద్మాస్యాశిరోరత్నమై॥

చ. కనుగవ కింపునింపు నల కామినిసొంపు హాగంగు రంగుమీ
ఱిన నడల న్నెడంగు కనుఱెప్పలు వాల్పక యప్పళించి యొ
ప్పిన కనుగీఁటులం దిగిచి వేడబమందెడు కోడెగాండ్రకు
న్మనసులు చిన్నవోవఁ గనుమాటుగఁ దాను జరింపఁజూచెడున్.

మ. ఎవరో యీ యువతీశిరోమణికి నా కెంతుం గన న్నాటియై
న వధూరత్నమె కానరా దెవరు నంటంబోని దేపువ్వో! గో
టి వెతం గాంచని లేఁత దేచివురో! పాటింపంగ దీటౌనన
నవరు న్నిటును గోఁటు దాఁటు నెటు లెంచ న్మేటి దేబోఁటినేన్.

ఉ. సౌరు నిసర్గమై యిటు లెసంగిన నింపచ్చుఁ గాని, లేని శృం
గారముఁ దెచ్చునే? యెరువుగా బరు వెత్తిన, నెత్త్రు, నెత్తు బం
గారము, మెర్గుఁజాలది నిగారము కూర్చిన యంత్రమాత్ర నిం
పారునె? కేకియంద మెటు లందునె యెందును గూట స్రష్టులన్॥

ఉ. నాఁచిననాఁటినుండియుఁ గనం గలిగెంగద వేనవేల నే
యేచిగురాకుఁబోఁడులనొ! యెన్నఁడు నామది కింత వింతగాఁ
దోఁచెనొ! యెంతచూచినను దోహలమూఁ గన నింకనింక, వా
చాచతురత్వ మింతయును జాలదుగా సతిరూప మెన్నఁగాన్॥

చ. సుదతుల నేరిఁ జూడ నవసుందరగాత్రలఁ గన్నతల్లినిన్
వదినెను జూచినట్లకద నర్తిలు నెమ్మది నేఁ డిదేమియో
ముద మెదఁగోర్కులుంబొదల ముచ్చటలెచ్చఁగ మ్రుచ్చిలించెడుం
జెదరునె నామనం బొరులచేడియ తా నయియున్న నెన్నఁడేన్?

క. అడుగుదునా యభిరాముని? నడిగిన నీచాసఁగూర్చి యరయుటిదేమం
చెడఁద నెటు త్తలపోయునొ! జడిసిన నిజ మెట్లు తేలఁజాలెదునంచున్॥

## కథానాయకాభివర్ణనము

మ. అనుకొంచుం జనునంతలోఁ దనను డాయంజూచి యాలేమ ము
న్నెనియున్నట్టిది రూప మిట్టిదవునే? వేమన్న రానున్న వాఁ
డని, రాఁగా నభిరాముస్వాగతము తా నందం దిగంబయ్యెఁ, గా
మిని, నేకామిని కాముఁడీతఁ డనునెమ్మిం గాంచదం చిట్లనున్॥

ఉ. కంతునిఁ బోలుసుందరుఁడు కాంచనసన్నిభదేహకాంతి న
త్యంత మనోహరోత్తము జయాంత వసంత నితాంతశోభఁ గ
ర్ణాంతవిశాలలోచన కనత్కరుణాకర దృక్ప్రసారముల్
సంతసమార మీఱ విలసన్నవయౌవనతేజ మీనఁగాన్॥ 138

క. కంబుగ్రీవం బెన్నం గంబును గంబువునిల్పు కరణి నెసంగం
గంబులు భాసిలుబాహులు గంబువు తుండములనంగఁ గ్రాలుచు
నుండన్॥ 139

ఉ. మీసము గాముఖంబునకు మేల్మి విశేషము లబ్జకేశి భా
భాసముఁ గూర్పఁజాలెడు ప్రభ న్నయనాబ్జములుం గళాబ్జ మ
జ్జాసవపాత్రప్రచారము కరాబ్జ పదాబ్జ సమార్జితస్థితిన్
హా సుమబాణుఁడే యనఁగ హాసము లబ్జనిభాచ్ఛముల్గదా॥ 140

చ. ధగధగలాడు కాంచన సుధామయవిగ్రహ నైజతేజము
న్నగుమొగము న్విశాలనయనంబులుఁ గన్గవ కింపు నింపఁగా
నెగుభుజము ల్బలాతిశయ మొన్నఁగనొప్పు విశాలవక్షముల్
సొగసులుగుల్కు వైఖరులు సొక్కములై తగు నిక్కనిక్కమౌ!

ఉ. ఇంద్రునిఁబోల్ప గౌతమమునీశ్వరపత్ని వరించు పాపుఁడై
చంద్రుఁడొ తారఁగూడిన నిశాచరుఁడై కన శాపలోపముల్
సాంద్రతరప్రభాపటల చారుసురూప వినిర్జితాంగజుం
డింద్రునిఁబోలు సంపదనె యిందునొ మోమున హాసచంద్రికన్॥

వ. ఇట్లాయువతి లోలోన వర్ణించుకొంచున్న యవసరంబున నాతండ డాయనేగుడు నించుక మోము వంచి క్రీఁగంటం గనుంగొంచుం దంతగం గాంచిన వేమయ్య యభిరామయ్య నుద్దేశించినవాఁడై. 143

'విశ్వ'దాభిధాన పూర్వోత్తరము

క. మాముక్కుఁ ఊఁ బరికించిన యామానిని యూరుఁ బేరు నెఱిఁగింపు మనన్
వేమారెడ్డికి నను నభి రామయ తద్వృత్త మతఁడు శ్రద్ధవినంగాన్॥

క. పుట్టెను రెడ్డికొలంబున గిట్టం దలి, రోవెలందికిం దంఢ్రియిడన్
బట్టెనిగాఁ బెంచెం జేపట్టంగాలే దెవండు, వసియించు నిటన్॥ 145

క. తొలి నే'యశోద' యనిరో! వెలయుం బిలువంగ నేఁడు 'విశ్వద' నాఁగాఁ
గులవృత్తి నొల్ల దాటను గలుషమ్ములువాయఁ బలుకు గణికల కెల్లన్. 146

క. విద్దెల నేర్చినదాచున్నద్దులు పెద్దలకెచెప్పు పోడిమిఁ గననై
తిద్దయు నీశుం గొలిచెడినుద్ది గుణంబున గణింప నొప్ప దదెందున్॥

క. ఆపెంచిన పణ్యాంగన 'యేపురుషు వరింతువమ్మ యెఱిఁగింపు...
జేపట్టుదు నొకరెడ్డిని నాపాలిటిదైవ మతఁడె నాఁగొల్తువశుఁ... 148
క. అన వినఁగా నాభాగ్యము తన కబ్బెఁగాత మంచు దాఁగొనఁగా
మనమున నదె చింతించుచుఁ జనె ముక్కలఁ జేతఁగొంచు సంజ
వడంగాన్॥ 149

## సాయంసంధ్యాకాలము

సీ. పగలెల్ల నేపాట్లొ పడి కాళ్లు లీడ్చికొం
చును గొంపలం జేరఁజను జనాళి
గ్రాస మేబీళ్లనో కానలసిన దేరి
కొనుచుఁ గొట్టముల కేగు పసుపాళి
చెట్టులం బుట్టల నెట్టెట్టొ పొట్టలఁ
బోసికొని గూండ్లకై పో ద్విజాళి
యేడ నేడనొ నూక లేరి బారులఁదీర్చి
బాట లోయనుఁ బట్టు కీటకాళి॥
తే. సృష్టి నెల్లెడఁ బురుషు లా స్త్రీచయంబుఁ
జేరి గీముల సుకమందఁ గోరుచుంట
సహజ ధర్మముగాఁ దోఁప సాగె నాఁటి
చీఁకటి మనంబు నెట్టొ చీకాకుపఱుప॥ 150
క. వ్యాయామశాల కేగక యాయెడ నేకాంతసీమ కాతఁడు నడచెఁ
బాయక చీఁకల్లెతనకుఁ జేయూఁతగ వెంట నడచు స్నేహితు
లనఁగాన్ 151

## చంద్రోదయము

ఆ. ఆతఁ డే మొనర్చునో తొంగిచూడ నాఁ దారకాళి చదలఁ దారు
చుండ
నెక్కఁ దూర్పుకొండ రిక్కలఱేఁడంత వేపవచ్చె నపుడు వేమనన॥
ఆ. అననుభూతపూర్వ మాస్థితి యదియేమొ భీకరుండుగా సుధాకరుండె
నిజకరాళిఁ బఱప నెత్తి కెక్కన్నాగె నాతపం బదేమొయంచుఁ
దోఁప॥ 153

ఉ. ఎల్ల జగంబు నావలెనె యెంచెడినో! మఱి యట్లుగాక, యా
పల్లెదొరా! నాపయినె సాహమొనరింపఁగ సాగెనేమొకో!
యుల్లమునందు నాయువతి యొప్పిద మొప్పుట ముప్పుఁ దెచ్చెనే?
చెల్లుఁగ రేఁగి ధృష్టులను వేఁచెదు, నాఁచెడు మార్గ మేయదో!
ఉ. పోవుదునా సతి న్దరియఁ బోవఁగ నేవగ కాండ్రు నూతురో!
తా వెటొ చేరఁబోయినకడంక కె విశ్వద యేవగించునో!
నే వెదఁ గ్రైతినన్న వదినె న్మది నెవ్విధి నొవ్వకుందునో!
యే వెఱఁగొన్న నన్నటకెయీడ్చెదుఁగా మది యంచు నెంచుచున్
ఉ. పోదునె రిక్తహస్తములఁ? బూవుల నేవియొ తావులీను జ
వ్వాది పునుంగు నత్తరువు వావిరిగాఁ జవిఁగూర్చు భక్ష్యముల్
స్వాదు ఫలాదికంబులు వెస న్బసఁ గొల్పెడు రత్నహారముల్
మోదమును ల్లుహాలచయము ల్కనకాంబరపాళిఁ జేర్చెదన్. 156
ఉ. ఏసతియైనఁ బ్రీతిఁగన నింపవు నాయవి కాస్కవెట్ట సం
తోసిలి యూఁదగంబుమెయి దోసిలి నొగ్గుచు నాసనం బిడున్
గాసిల నేటికం చరిగి కైకొని యన్నిటి గంపకెత్తి వి
శ్వాసమువీఱ విశ్వదనివాసముఁ జేరెఁ చెన్నిచ్ఛలీనఁగాఁ॥ 157

ఆశ్వాసాంతము

మ. శ్రితరక్షాపర దక్షిణాస్య కరుణాశేషప్రభావాత్త వి
శ్రుత దిగ్దేశ బుధేశవర్ణిత మహాశుప్రక్రియానిర్మిత
శ్రుతిపేయాంచిత సత్ప్రబంధ విలస త్తోసేదార వాగ్వైఖరీ
నత విద్వత్కవి కాననాంతవిచర న్న్యాంసుప్రభాభాసురా! 158
మాలిని. వినుతహరితగోత్రా! వేంకటేశప్రపౌత్రా!
సునయవిబుధమిత్రా! సుబ్బయాభిఖ్యపౌత్రా!
ఘనకవినుతిపాత్రా! కామయాఖ్యాకపుత్రా!
మునిసదృశచరిత్రా! ముక్తికాన్తాకళత్రా! 159

గద్య. ఇది శ్రీ మేధాదక్షిణామూర్తీశ్వర రాక్షిత కరుణాకటాక్ష వీక్షాపాత్ర నాదెళ్ల పురుషోత్తమ కవీంద్రపుత్త్ర మేధాదక్షిణామూర్తిశాస్త్రి నామధేయ విద్వద్విధేయ కర్తృక శ్రీవేమయోగీయంబునందుఁ బ్రథమాశ్వాసము. 160

# శ్రీ వేమయోగీయము.

## ద్వితీయాశ్వాసము.

క. శ్రీదక్షిణాస్య కరుణా సాదిత కవితావిలాస శశ్వత్కీర్తీ !
నాదెళ్ల పూరుషోత్తమ భూదేవోత్తమవరేణ్య ! పూజ్యస్ఫూర్తీ !

వ. ఆపై నా పొత్తుటాలితో నీ పల్లవుం డుల్లాసంబు వెల్లి విరియించిన తెఱం గెట్టిదనిన.

వేశ్యావాటిక

సీ. కావేరులప్రతోళి కాములకు బాళి
నగలమారి పిసాళి తొగలహాళి
యెలుచూడ విటపాళి యుంపైననటకేళి
వాకిళ్ల మందాళి వటుల [illegible]
కేలనుబ్రసవాళిఁ గిలింపఁ గంకేళి
సిగవాటులవిరాళి జిగుల [illegible]
వలపింప నారాళి కులభక్ష్యములు పోళి
యులుపలిం కేపోళియో నివాళి.

తే. కాఁగఁ గామంపు టావళి గాజురవళి
వీనువిందైన జావళి వినఁగనోలి
యువకపల్లవరింఛోళి యూర్పుమాలి
నెగడ సౌధామ మచటి గాణిక్యసీమ. 3

శా. ఆ సీమంతిత మైనవాటికను డాయంబోవ నేవారికే
నాసీమంతము లాప్రసన్న ముఖరమ్యత్వంబు లాతళ్కు బె
ళ్కా సీమంతిను లూనుతావులును దామై స్వాగతంబీయఁగా
'నాసీమాంతము' చల్లఁగా నొడిసి సన్యాసంబుఁ జేకూర్పరే ? 4

## వేమారెడ్డి కాలక్షేపము

క. అచ్చోటికి మచ్చికపడి విచ్చేసెదు వేడ్కకాంద్ర వేమన యొక్కఁడై
విచ్చలవిడి విశ్వదకుందెచ్చుచుఁదానిచ్చుచుండెఁదివురువిభూషల్.

క. వారిద్దర నెయ్యమ్మది యేరికి దంపతులఁగూడ నెందుం గనమిన్
వారాంగన లబ్బురపడి పేరిమితమకాలమునందువిశ్వదగొనునాన్.

క. వేమనయె తనకుజీవము వేమనయే తనకుభర్త వేమనకంటెన్
భూమిప లేరిఁక నాప్తులు వేమనయే దైవమంచువిశ్వదయెంచున్.

క. వే, మధురభాషణంబుల వేమన్న మనంబువాంగ, వేతొనవరేన్
వే, మనఁగనయ్యోలేమకు వే,మనఁగనిహాసఁబరము వేమనయేనాన్.

క. అడుగులకు మడుగులొత్తును నడయాడం దడయదెందు నాడెపు
మడుపుల్
తడియారఁజేసి విడెమిడి చిడిముడిపడదేమియడుగఁజిత్తంబుడుకన్.

క. అగపడనే చిఱునగవున మొగ మింపుఁదలిర్పఁజేసి ముందిడుపాద్యం
బాగి నార్చిసమర్చనములకగుసర్వమమర్చికూర్చునర్హాసనమున్.

క. కావలెనో పానీయం బేవితమున సేదఁదేర్ప నేర్పడునంచున్
వీవన చేకొని వీచుం దావులుఘులుఘులురవమ్మతనుపమనమ్మున్.

క. తీయములేయవొపలుకఁ-చుడాయంజిఱునగవులొలుకఁదాకున్ దీకున్
బాయంగఁ బ్రసన్నుఁ డౌడుఁ బేర్చియసి సవరించు నుత్తరీయపు
టంచున్. 12

క. యోగక్షేమము లరయును రాగము పెంపొందసత్వరంబుగఁజాంపే
యాగరు తైలాభ్యంగము తాఁ గరముల నంటు నలఁదుఁ దనువున
నల్చున్. 13

క. మున్నే కాచిననీటను జన్నీళ్లనుగలిపి రుద్ది స్నాతుంజేయుం
బన్నీట జలకమార్చెడు నెన్నో ముచ్చటలువలుకు నింపులుగు
లుకన్. 14

క. తడియార్చును ముడివైచును వడి నిడి సాంబ్రాణిపొగల వలువ లోసంగుఁ
జెడుగుడి యాడినవడువున నడుచుం దిలకంబుదిద్దు ననుపుగవీచుఁ.

క. పరిమళగంధద్రవ్యము లురవుగ నవియివియలంది యువ్విళ్లూరఁ
దరిఁజేరెఘుఁ గరమింపౌ విరిపాన్పునఁ జేర్చి కూర్చి విడెమిడు నోడిఁగోన్. 16

క. మధురఫలా ల్భక్ష్యమ్ములు మధురసభరితంబులెన్నో మదవతి యిడుచున్
మధులిహాయుతముఖపద్మపుటధరామృతమన్మధూలికాసించుతటిన్.

క. తానంద న్మంజరులననూనంబౌ నాసఁగొలుపనూల్కొనుకోర్కెన్
బౌనఃపునికం దార్చెడునానందామృతపయోధియవధికనుఁగోన్.

క. ఒడలెఱుఁగని యొడికారపుఁ గడిమిమెయిం దడయ కొందుఁగడఁగి పెనంగన్
వడివడి నెడయు న్మడివడు నోడుప న్మదుఁగక యుడుగమి నోడి యుచు బడిగాన్. 19

క. అరమరిక యరయ కురమున కరమున నురమునులగించి యాప్యాయముగా
నిరవొప్ప నురవడించుచుఁ బురుషాయితమున భుజిష్య పురికొలు పంగాన్. 20

క. రేకత్రినయాకలనము వేఁకరమౌ ఘాక జోక వీఁకఁగొనంగా
నాకంబదె లోకంబెది నాకింకను లేదటంచు నాన దొఱంగన్.21

వేమన నాతని వదినగారు మందలించుట

ఉ. చామసపర్యలందు చలసానులవాడకె పాత్రికాంపు కా
నై మసలంగ, రెడ్డికొల మంతకతండిటు మచ్చుదెచ్చు, 'న
తొమ్యా! మనువైన,మానసవునో!'యనునూహానునన్న భార్య,'యో
యీ మాటేదీ! కులీనఁ గన నేగుద, వీయెడ వచ్చెరంచనన్.

ఉ. వేమన పల్కె నాయమకు 'వేశ్యలలోననె కా దిఁకెందు నీ
భూమిని గల్గులేమలను, బోలికకు న్గుణరూపసంపదన్
దా మెవరైన విశ్వదకుఁ దాళరు, చూడ నిఁకేమొగమ్ము నా
కై మననంబుసల్పు నలకామిని వీడుట నాడెమౌనె?' నాన్. 23

ఉ. 'ఏ మిటువంటివెఱ్ఱి కలదే? భువినెయ్యెడ సానులెవ్వ రే
వో మటుమాయలం గొలుపుచుందురు వానికి లోఁగిపోయెదే?
వేమయ! చెప్ప సిగ్గిలక, పెంశిలియేటి కటన్నరీతి నం
దేమయ? యీమెయి న్మెలఁగ నీగుసుమీ, కులగౌరవంబయో!

ఉ, ఎందును లయ్యలొయ్యన నెదే న్దమకందిన యంతవట్టు గో
కందగు వీళ్లె చూచుచు, నిగారమొనర్చు నిగారమందురే?
మందులమారిగుబ్బెతలమాటలు నమ్మి కులమ్ము గౌరవ
మ్మొందలఁగం జెలంగుటను, మోసమవు న్మఱదీ! వినంగదే. 25

ఉ. పిన్నటనాఁటినుండి నినుఁ బెంచినదానను గన్నవానిఁగా
నెన్నుట విన్ననం గనసహింతు నెటు? ల్వాల నన్నెలాండ్రిలోఁ
గన్నెతనంబు నెవ్వరికిఁగానియు జన్నియపట్టనౌనె? వే
మన్న! సమీహితం బిడెడియన్నుఁ గొనన్వినుమెన్నకన్నియున్.

మ. ధన మెంతేనియుఁ గొల్లకొట్టి, కులనిందం దెచ్చుచుం, బీల్చి పి
ప్పిని జేయంగల తొత్తుపొత్తులకు నువ్విళ్లూరఁగా రాదు, నీ
జనియు న్మన్నల తాతతండ్రుల సమాచారప్రకారంబుఁ గీ
ర్తిని బాటించి, చరింపఁజూడవలెఁ, దండ్రీ! వీడుమామార్గముల్॥

ఉ. ఏవెలయాలుగాని ధన మెట్టుల లాగుదమన్న చింతతో
నే వగలాఁడిచేష్టల నెవే న్సలుపంగనె మచ్చుచల్లిన
ట్లై వెడఁగు ల్వితాకుపడి యర్థముఁ బ్రాణము దానికర్పణం
బా వెడదోవఁ ద్రొక్కుదురయా? మఱఁదీయటుమోసపోకుమీ॥

ఉ. ఏవిధమైనయున్నతి యొకించుకగన్న ధనాప్తి మిన్నకా
నై వెలయుంగ జవ్వనపుబోసును బాటవమున్నయంత, కే
వేవో సపర్యల న్సలిపి, ఝుచ్చకమారఁగ మచ్చుఁగొల్పి, యా
యావిభవంబులాఱఁ దుద కవ్వలికీడ్వరె, వారకామినుల్? 29

చ. 'అతుకులమారిబొంతలకు' నాసఁగొనం దలపోసి గాసిగా
'గతజలసేతుబంధనమొ' కానగు నప్పుడు చింతిలంగ, నీ
హితమునుగోరి చెప్పిన దొకింత మనంబునఁ బట్టనిత్తువేన్
జతకవు నింతిఁ గూర్చెదము శాశ్వతకీర్తి సుఖాప్తి యేర్పడన్.
ఆ. సంఘనియమబద్ధ సంఘమే పాలించుధర్మపత్ని యెసఁదలగఁజనదు
'వడ్లతోడి తట్ట' వలె నెండి తడియుచుఁ గష్టసుఖములందుఁగాదె
తోడు ? 31

మ. ఘనులైనట్టి తపఃప్రభావులు జగత్కల్యాణముంగోరి, సం
ఘ నయార్థంబెది నిర్ణయించి రదెతొల్లిక్కంజక్కనానిక్కలన్
మనపూర్వుల్వెలయించికోఁగలిగి రామార్గంబె శ్రేయస్కరం
బని రూఢంబయియున్న దీ వెఱిఁగి వేమా! సాగు మీ వింతటన్.

వేమన తన వదినెగారి పూనిక మానఁజేయుట.

మ. అనుసీమాదిరిబోధల న్నలుపఁగా నాలించియాలించి, వే
మన తాఁబల్కె నిజాగ్రజాంగనకు, 'నమ్మా! ధర్మమీవన్నదా
నని మమ్మాటికి నేనెఱుంగనిదికా, దాఁగాక, నీవల్లసా
ని నితాంతోత్తమసచ్చరిత్ర మెఱుఁగ న్సిద్ధి కొంకు లేదందుసూ.33
మ. అకలంకంబవు రెడ్డివంగడపుదై, ప్రారబ్ధముంజేసి, త
ల్లికిఁ దానోమనిదౌట, నోమ మసురాళి న్వర్ధిలం గల్గినన్
వికటం బింతయు లేనిదానినెసుమీ! వేమన్న ప్రేమించి యం
దుకొనె, న్నీదుపదంబులాన, యిఁక నెందుం బొందునేఁగందునే?
శా. ఈవే విశ్వదచర్య యంతయును గాంతే నున్నంత యి ల్లింతువే?
యేవో బిత్తరి పొత్తుటాంధ్ర నడత ల్లీనంబులౌఁగా కెటన్
ద్యావాపృథ్వుల సద్గుణాకృతుల విద్యాసంపద న్నాటిగా
రేవారైనను, మోహితాత్మను గా, దే నిట్లు వర్ణించుటల్. 35
చ. వెలమెలనాగయం చిటులఁ 'బేడయు బెల్లము నొక్కరీతి' గాఁ
దలఁచుచు నెంచుట ల్తగదు, తద్గుణరత్నపయోధి నెవ్వరేన్
జులకనసేసి యేమనిన శోత్రములం బడనీయనొల్ల, నిం
దల నను బందుగుల్నలుప, దానికి నామది కుంద దెందునున్.

ఉ. ఆలని త్యేఁగ బాప లెదొ యర్థముగానిది పాటపాడ, 'మం
త్రాలకుఁ జింతకాయ లెవిరాలవు, దానవె బంధ మెట్లవున్ ?
గ్రాలవె పోరు లెన్నొ ? కులకాంతల నెందఱు తప్పుదోవలం
దొల్చఁ జరింపఁజూడ, మిలనాత్మకు నాత్మకె మైత్రిగావలెన్. 37

చ. అవిరళబంధ మందితి మిహమ్మున నద్ది యభేద్య మమ్మ ! త
ల్లి వలె ననుం గన న్వాడువలేకకదా యిలుసేరుచుందు, నో
యి వదినె యింకనెన్నఁడు నిఁ కిట్టిప్రసంగ మొనర్పఁ గంటికే
యవుదును దూరమంచు మదినారసి యెత్తకు పెండ్లిముచ్చటల్.

వేమన వదినెగారి మహోదారత.

మ. అని వారించిన 'రానె ర్యాఁడొకొ'యటం చౌనద్ది కానున్న ద
ద్దని తా నంతట మిన్నకుండె, నెవరేమన్న న్సరే యంచు, వే
మనయు న్వచ్చుచు నందినంత కొనిపో న్మానం డతం డెద్దికో
రునుగా కీయకమాన దేమన కటాపోప్రియాలు, వేయేటికిఁ. 39

మ. ఇలలోఁ లేరె వధూనికల్? 'నిజసుతుండే యానొ!' యన్నంత ని
శ్చలకారుణ్యపు దృష్టి దేవరుఁ గన న్యాజాతకే చెల్లె, నేఁ
డలఘుశ్రీనరసాంబికా గుణగణేడ్య ప్రాభవోన్మేషకే
కలిగె, న్వేమన లక్ష్మణప్రథితి కెక్కం గస్తి తా నందమిన్. 40

మ. అతిలోకోత్తమసచ్చరిత్రుఁడు సుమిత్రాపత్య మానాఁడు, వ
ర్జితనిద్రాభ్యవహారదీక్షను నిరర్థీభూతదైత్యేంద్ర జి
న్నతినార్జించె, వధూని కాంఘ్రియుగళి న్పూజించి, వేమన్న సం
చితపుణ్యుండు సుఖానమించె వదిన న్సేవించి శ్రీగాంచఁగాన్. 41

మ. అకలంకంబుగ నూర్మిళాధవుఁ డనన్యంబైనసద్భక్తి, సీ
తకు సేవ ల్పదునాలుగేండ్లు సలుపం డా నొక్కనాఁడైన నఁ గ
ర్ణకఠోరోక్తులు పల్కనావదినె, కుందంగల్గె, వేమన్న యిం
తకుఁ దాఁ గల్పితనష్టుఁడేయయిన నిందల్నొందఁ డేమందునో! 42

వేశ్యా మాత

మ. ఇదికా నానరసాంబ సద్గుణగణంబేకాక వేఱేమి ? వి

శ్వద మైన నృఖు నవ్వి యివ్వి యడుగ న్వాంఛింప దాఁగాక,తా
నదనైనప్పుడు మాన దెన్నఁడును, వేశ్యామాత 'గొంతెమ్మకో
ర్కి' వనం దోఁచినదెల్ల సాగుకొలఁది (నేకెత్త నిష్ఠారముల్. 43

ఉ. కాదన కేదికోరినను గామితమారఁగఁ దెచ్చి యిచ్చి యా
హ్లాదముఁ గొల్పనో ముదిరుఁ డబ్బినలిబ్బుల నుబ్బకుండ్రె? సం
పాదన జవ్వనంబుతఱి వా రలవాటును గన్నవార లై
చీఁదఱ దోఁచుదనకఁ దమచెయ్దము లేరును మాననేర్తురే? 44

ఉ. మంతనము ల్సదా సలుపమానదు, విశ్వదఁబిల్చి 'దీపము
న్నంతకె చక్కఁబెట్టుకొన' నయ్యయిరీతులఁ బల్కమాన, దా
వంత చెవింజొరం గలుగదంచు మనంబునఁ గిన్కఁబూని వే
దాంత మిదేటిదంచుఁ దనయంత వ్యళీకము లాడమానదే! 45

మ. ఒకనాఁ డాతఁడు నిద్రలేచుతఱి కెంతోహాయిగా విశ్వదా
వికచాబ్జేక్షణ వీణమీటు విని యుద్వేల్లార వేశ్యాంబ 'పా
నకమందుం బుడు' కట్లు పల్కఁ గన నానందం బెట'న్నిల్వదోఁ
పు' కదా యీవలె, నర్సమాంబనగల న్బుద్ధిం దగ న్నిల్పితేఁ.

క. మీవదినెవి, నగలన్నియు మావిశ్వదయే ధరించి మాదేవివలెం
దా నెలయఁ జూడకుందునె? మీవంటి రసజ్ఞులెంచ మేమనవలెనే?

క. అని యనవుడుఁ దమయింటికిఁ జని వేమన నరసమాంబ చరణంబులపున్
దనశిరమంట న్సాష్టాం గనమస్కృతిచేసి వరముకై కొనియడిగెన్.

ఉ. ఓవదినే! మనోహర మహా! యనిపించిన దివ్యగాన వి
ద్యా విభవంబు నామది కనంతసుఖావహమైనయంత, సం
భావితమా రసజ్ఞతను బట్టి యొడ ల్పులకింప 'నిల్వదోఁ'
పీవలెనంటి నీనగల నిచ్చి ననుం గృతకృత్యుఁ జేయవే. 49

క. అని సిగ్గువిడిచి యడిగిన తనచిన్నయనుంగుమఱఁది తానీయని-చోఁ
జని సాహస మెదిసేయునో! యనియెంచి సమర్పణంబు నాయమ సల్పెన్. 50

ఉ. ఏనుఁగునెక్కినట్లయి సమీహితమార్గఁగఁ దోడుతోడ వే
శ్యానిలయంబుఁ జేరఁజని యాభరణంబులనెల్ల విశ్వదా
ధీన మొనర్ప నాయమమది న్గడునుబ్బి ధరించి తత్పదం
బౌనఁగ నీదుదాది కివియన్నియుఁ జూపుము తుష్టినందునాన్.51
క. ఆయింతి యింతలోనన డాయంగావచ్చి చూచి డాఁచినదానిన్
వాయోడు దేల యడుగ న్వే యున్న బులాకిలేమివెలితియకాదే?
ఆ. ముక్కుఁ గోసినట్టు ముక్కఱకొదవైనఁ జందు గోరుమోము
నందమీదు
పొందుఁగోరురసికపుంగవులెఱుఁగ రే? నోరుబయట వేసినారుగాక.
క. ఆనాఁడు ముక్కఱంగని యేనాఁటికినైన దాని నీయకయున్నే?
కాని మ్మటంచు నెంచిన దానికిఁదానిట్టు కొఱఁతఁదలఁపందగునే?
క. ఆయమ్మ యీయనన్నను నాయమ్మే? యన్ని యిచ్చినాసాభరణం
బీయమి యెట్లైనఁ గొఱఁత యే యానని పల్కఁజాల కేటికి
విడువన్? 55
క. మోమోట మంచెననుకో కామిత మిదితీర్పకున్నఁ గాదనఁగా నా
శ్రీమంతురా లొసంగదె? వేమారెడ్డయ్యగారె వెనుకాడుసుమీ.
క. సంబరపడి యదియిడికొని బింబాధర గజ్జెఁ గట్టి భేషనిపింపన్
రంభానృత్యముసలుపన్ సంబాళింపంగఁగనక జా గేమిటికో! 57
క. అన నాడనిలువనోకయునుగలయదియెల్లఁదుడిచి యొరుపుమీఱం
గ నొసంగు వదినెగారిని యనుపమ మది విలువగలది యడుగ
వెఱచియున్. 58
క. తలఁగట్టి యొక్కగదిలో పలిసెజ్జను బండి తిండి పల దన్నంతన్
నలినాక్షి వదినెయటుసని 'యలు కేటికినింకఁ? బలుకవది యేమిటికో!'
క. నీ వేదియడుగఁ గాదన కేవస్తువునైన వెంటనే యిచ్చితిఁగా
యో వేమనరా వేమిటి? కావిశ్వద కింకఁ గొఱఁతయయ్యెనె యేదేన్?
క. మీయన్న యేమియన్నను నీయడిగెడి దింకెదైన నిత్తును లేవో
యీ! యింక లేచిరావలె మాయన్నా! పలుకుమయ్య మఱుఁ గే
దుడుగన్. 61

క. అని బుజ్జగించువదినెకు ననలే కనలేక యున్నయది వెలువఱపం
గనె యామెశిరము కంపంబు నొనర్చుచు బదులువలుకు బుద్ధి
మరల్పన్. 62

వేమన వదినెగారివలని వైరాగ్య బీజావాపము.

మ. 'సరె నీ కిత్తుఁ బాసచేసినదె, యేచందాన నందాల బం
ధుర కంఠింపఁగ నౌనొ ముక్కఱ, యొనర్తుం జెప్పిన'ట్లన్నఁ, గి
క్కుఱ నా కాతలఁ ద్రిప్పునే వదినెపల్కున్, 'స్నాత పీతాంబరా
భరణన్, వే్రలఁ గురుల్, తనువు వంపం గ్రింది కందింపుమా!' 63

మ. అని నాసాభరణంబుఁ జేత నిడ నే సానందుఁడై మ్రొక్కి, బా
సను లో నెంచుచు, నగ్నదగ్నవిశేషం బేమొ! యట్లే యొన
ర్తును శృంగారవిశేషచేష్టయని సంతోషింపఁగా విశ్వదా
వనజాతేక్షణ వంగి తీసికొను నబ్భంగిం గన న్మోదమా. 64

వేమన ముక్కఱఁగొని తనప్రియురాలి డాయనేగుట.

చ. కులుకుమిటారి, యందములకోన, విలాసపుటాటపట్టు, చం
చలనలినాయతాక్షి విలసన్నవపల్లవకోమలాంగి, రా
చిలుక, కడానిబొమ్మ, కలశీకృతరమ్యపయోధగపబ్రిభా
కలిత విశాలవక్ష, నొడికంబునఁ గాంతు దిగంబరమ్మతిన్. 65

వ. అని తలంచిన యాతం డెంతయు నువ్విళ్లూరుచుం బోవ నావని
తామణి తానే యెదురై. 66

సీ. ముంగురు ల్ముఖపద్మమున వ్రాలు తుమ్మెదల్
గా గాలి కిటునటు కదలియాడఁ
జిఱునవ్వు వెన్నెల ల్మెఱువారఁ జేయంగఁ
గస్తూరితిలకంబు కొరుదేరఁ
దన తనూలతకు విస్తారమ్ములై యాడు
మంజరీద్వితయమ్ము మరులుకొలుపఁ
గ్రిందికి జీరాడుచుం దగు కుచ్చెళ్లు
ముందర నటునిటు చిందుఁద్రొక్క॥

తే. రత్నకాంతులు నెమ్మేన రంగులీనఁ
బరిమళద్రవ్య ఘుమఘుమల్ స్వాగత మిడఁ
గింకిణీరవ మడుగడ్గు కెరలి వఱలఁ
గరములంజాచు విశ్వద కౌఁగిలింప॥ 67

చ. పులకర పూర, రెడ్డిమనముం గలఁగించుచుఁ జేతనున్న ల
క్షులవిలునైనముంగఱ నొసంగుతలంపును నంతలోనె సం
చలిత నిజప్రమాణవివశత్వముఁ దోఁప వచింపకున్నచోఁ
గలికి కలంగి, దాది యొడికారముగా నెది పల్కఁ దప్పనున్. 68

శా. మీ రిచ్చంగొని యేదొసంగిన నదే మేలౌను నోనాడుచుం
గారింప న్సహియింప ముంగఱను సింగారింపకున్నంతనే
తీఱెంబో ముఖసౌష్ఠవం బటను ధాత్రి న్వృద్ధిఁ బాటింప కా
ధారం బీవయి నన్నుఁ బ్రోవవలదే తప్పెల్ల మన్నించుచున్? 69

మ. అని పాదంబుల నంటఁబోవ నగుచు న్వ్యాలోలచిత్తంబుతో
'వనజాక్షీ! కలకోర్కెఁ జెప్పుదును దీర్ప న్బాస, ము న్జేయఁగా'
ననుడు న్విశ్వద 'నీకుపాద మిదెయానం జేయువాగ్దానముం
గొనుమా, నీ వెడికోరఁగాదనను సంకోచింప కేఁజేయుమున్.'70

మ. అన విన్నంతనె, రెడ్డి పల్కె సతితో, 'నైన న్సరే,యొల్చి భూ
షణవస్త్రాల, విదల్చుచు న్జపఁ గృతస్నానస్థితి న్వచ్చి, యి
చ్చినరీతిం గయికొమ్ము ముక్కఱ యిదే, సిగ్గెల్లఁ బోనాడి, నా
మనముం దుష్టిని గొల్పుదే న్బరమగమ్యం బందనౌనాకిఁకన్. 71

చ. అనవుడు నవ్వి యాసుదతి, 'హాస్యమిదేటిది ? లేనిపోని వి
న్ననఁ గనఁజేయ నెంచు టది నాయమె?నీకు స్మరస్వరూప! నా
తనువును మాన మిచ్చి, పదదాస్య మనన్యముగా నొనర్చుదా
నను, నను నీపరీక్ష యగునా? తగునా? సుగుణాకర ప్రియా! 72

చ. ఎఱుఁగవె ధర్మశాస్త్రముల నెట్టులఁ బల్కిరొ పెద్దలందఱుం
దరుణులనగ్నదర్శనము తగ్గదికాదని యేటి కెంచిరో!

యరయ విశేటికోర్కి, కపహాస్యముపా ల్ననుఁ జేయనెంచుటల్
పరు వవుదయ్యె నీకుఁ? బరువంబున బంధములందు డించ నే? 73

వ. అని యాయిందీవరాక్షి సందిగ్ధమనంబుం గన్నచందంబుఁ గాంచి, యడుగుడమన్నం డాఁజేసియున్న బాసం డాఁట నెందేనయితిగా మిం డా నాసుందరాంగి నమందానందంబుచిందులాడం గంద మన్న డెందంబుతో నేమముం దొప్పింపందలకొన్నయట్లు మంద మందంబుగాఁ బలికె యస్పందంబు నందించువాఁడై. 74

శా 'ము న్నేనసవ్వను విన్నసంగొలిపి గోముం గూర్పఁగానాయెనే?
విన్ను న్మన్ను నెదెన్న సాక్షులుగ నుర్వి న్నినున్నఁగా కన్నులం
దెన్నం డేరి నెఱుంగనాట నిపుడాయెం గోరఁ బొన్నారిదా
విన్నాణంబు నిసర్గముం గనక, నే విన్నాణి నెట్లాదునో! 75

మ. ఎరువు ల్లొసిమ్ము లె వెన్నియున్న బరువే, యేనాఁటికైన న్మనో
హరమైనట్టి నిసర్గరూప మదె యాహ్లాదంబుఁ గల్పించు, సుం
దర మీరూపము నబ్జసూతి యెటుసంధానించె, నమ్మోల మే
నరయం గోరిక మీఱుఁ దీర్పఁగదవే యబ్జాతపత్త్రేక్షణా! 76

శా. నీసౌందర్యవిలాసవీచికలలో నేనెప్పు డోలాడ, నా
యాసం బింతయుఁ దోఁపనీయని యనన్యప్రాప్త దివ్యౌషధ
వ్యాసంగంబు ఘటించె దేన, నెఱుఁగ న్వ్యావృత్త చిత్తస్థితిన్
బాసం గోరితి నాసఁ గొల్పితివి, తీర్ప న్శంక లింకేటికే?' 77

మ. అని వాగ్బంధము సంధిలం బలుక, నాయత్తంబుకానై యనున్
'మనము న్నీవ హరించినాఁడ వపుట న్మాట న్గొనంజాలితీ
వనఘా! నే నెపు డాడి తప్పనుసుమీ, యాఁగా కిదైన న్సరే
తనువే యర్పితమయ్యె నీకెపుడో, స్వాతంత్ర్యంబు నా కేటిదో! 78

ఉ. ఏ మొనరింపుమన్న నిదె, యే నొనరించెదఁ గొత్తవాఁడవా?
కామితమారఁ గన్గొనుడుగా కని, చెప్పినయట్లచేసి, తాఁ
గా ముసినవ్వుల, న్వెనుక గాఁ జని, వంగిన నేన ముక్కుటన్
నీముకుఁ జేరనుంచెద నని, స్గనె, మో మెటో విన్నఁబోవఁగాన్;

మ. తలక్రిందై, మొల మొండిగాఁగ, ముకురంధ్రంబు ల్పయింజూడ, సం
కులతం జెంది శిరోజము ల్విరియ, నిగ్గు ల్వాయ వక్షోజముల్
మలభూయిష్ఠపుఁ గూపము ల్వికృతము ల్గాయించు పెన్భూతమా
కులతం జెందఁగఁ జేయు నట్లగుడు నెగ్గు ల్ద్రోఁప సిగ్గౌటయుఁ 80

వేమన్నకు వైరాగ్య ఫలావాప్తి.

శా. ఏపాపంబున నిట్టికూపముల కాసింపంగఁ దా నయ్యెనో!
గోపృష్ఠాభము గాఁగఁ ద్రోఁప, మది సంకోచంబుగా నయ్యయో!
యాపాదిల్లిన లోఁప మేగతిని బాయంజాలుదుంబో యటం
చేపుంబాయఁగఁ దాపమెచ్చ నపు డెంతే న్జింతితాంతస్థితిన్. 81

మ. అవురా! నేనిటు లెండమావులకునై యాసించి దుర్గంధపం
క వికారంబగు కూపమందుఁ బడి సింగారం బిదం చెంచి, పై
సవుకుం గాంచి భ్రమించి మించి విగతస్వాంతంబున న్నంచితా
ఘ విశేషం బొనరించినట్లు తెలియంగానయ్యె నేఁ డియ్యెడన్ 82

మ. ధనమా! యెంతగను కొల్లవెట్టితిని, నిందల్సేయఁగా నెందఱో
కనులంగప్పినచందమై మెలఁగితిం గల్యాణము ల్వాయ, దం
ధన దౌర్భాగ్య పినద్ధపద్ధతిని జేఁద న్మానమున్మ్రించె, నో
మనమా! దుర్భరగంధిలంబు మలసంపర్కం బిఁక న్వీఁడుమా! 83

మ. ఉదయం బందినదాది తల్లివలె నెంతో ప్రేమ నన్నేను నా
సుదతీరత్నము 'మోహ మిందుఁ దగ'దంచు న్నీతిబోధించు మా
వదినెం గాదని నిల్వుద్రోఁపుగను సగ్వంబొల్చి బాధించు దు
ర్మమనిం బాపునిఁ బాపు మింతట మనంబా! వీడ దుర్మార్గముల్॥

వ. అని యాతండు దనలోఁ దాననుకొంచున్నట్టు విన్నంతనే యాదిగం
బరురాలు దిగ్భ్రాంతిం జెందినదై యంతలోనొక్కచీనాంశుకంబు
నందుకొని యొక్కింత మఱుంగుపఱిచికొం చాతని దెసం గనం
బోవునప్పటికి. 85

ఉ. ముక్కలి నాడనే విడిచె, మూసెను గన్నుల ప్రాలె వెన్కకున్

న్వొక్కఁడ సపాటుఁ దెల్ప, వెనువెంటనె విశ్వద కౌఁగిలించికో
నొక్కఁ డెసం దెమల్చికొని యుండును నన్నిఁక ముట్టఁబోకనున్॥

మ. విని యమ్మానిని గుండె జల్లుమన 'నన్వేధించి సాధించి, వం
చనసేయందగ' దంచు నేడ్చెను, హతాశాబాష్పసందోహముల్
దొనలై చిందఁ బయోధరంబులపయిం, దోడ్తో కుహూకంఠ ని
స్వన నిష్యంద మరందబిందు లహరీ సంధాన మందం గనన్. 87

మ. అవుఁగా కాతని నెమ్మొగమ్ము విరసమ్మై మట్టమధ్యాహ్న మం
దు, వడ న్మబ్బులు గ్రమ్మి మైఁ జెవుల సందుం జేయఁగాఁ జాలమి
న్నివశుండై పెడదోఁచఁబట్టి పలికె న్వేశ్యాలలామంబుతో
నిదె నా యాకడసారిమాట లికఁ దల్లీ! నన్నుఁ బోనీఁగదే।

శా. నీమైచందము కాదు నీ వెఱుఁగ నంతేవాసికి న్నాకగుం
గామోద్రేక రసప్రభూత మహితౌకః ప్రాపణోద్యోగినై
యామంత్రించిన దర్పణప్రతినిధి న్వ్యాలోలచిత్తు న్నత
వ్యామోహాత్త్వ సముద్ధృతిం గొలిపి తంబా! నీకిదే మ్రొక్కెదన్.

మ. బహుకాలం బిటు లంధకారమున నీపాదంబులం దుండ న
న్నహము న్రేయి యనన్యమైతగు శరణ్యత్వంబు నే నెంచి, నీ
సహవాసమ్మును సల్పినందునఁ గటాక్షమ్మున్ బ్రసాదించి, యి
మ్మిహికాహార్యము నీవ కూర్చితివి సుమ్మా! నా కుపాస్యంబుగాన్.

మ. ఎఱుఁగం జేసితి వైహికానుభవ మెంతే న్నేఁడు నీవే యిటుల్
పరమంచుం గలదంచు నెంచుటకునై వైరాగ్యమార్గంబుఁ ద్రొ
క్కి, రహింపం గలయిచ్చఁ దీర్చుటయుఁ గల్గెం గాన నా కియ్యెలన్
గురువైతంచు మది న్భజించెదను లగ్గుల్గల్గ నెగ్గూడ్పవే! 91

## వేశ్యావేమనల సంవాదము

క. అనలేమ 'వలదటన్నను నను బాసయొనర్పఁ జేసి నమ్మించి యిటుల్
నిను నమ్మియున్న దీననుజను నేనవు బాట్లుసేయ, నాయక!' యనుడున్.

శా. మోసం బింతయు నీదెసం దలఁప, సమ్మోహాత్మతం జేసి, వి
[illegible]

యాసం బిచ్చిన నీదుదాసునెడ నన్యాయంబుగా నాగ్రహో
త్సాహిసవ్యావృతి దాకొనం గొలుప కంబా! తప్పు సైరింప వే. 93
మ. అరుదైనట్టిది నీకొలంబున నిటు ల్వ్యాసక్త చిత్తంబుతోఁ
బరునిం జూడక, ధర్మచారిణివిగా వర్తిల్ల నిం దైహికం
బురుసౌఖ్యోన్నతి సంధిల న్మెలఁగి యెట్లో పూర్వపుణ్యంబునం
బరముం జేరు పథంబుఁ గంటి మనుచున్భావింపుమమ్మా!యిఁకన్.

ఉ. అంబరమా చిదంబర రహస్యముఁ గప్పఁగ నంబరంబు లో
కంబు గన 'గతానుగతిక' స్పృహదూరమునుండి వచ్చు మో
హంబు ధనంబు నూడ్చుగతినై వెతఁ గొల్పెడు నారహస్య మీ
వంబ! దిగంబరత్వమున నారయఁజేసితి ముక్తి యబ్బఁగాన్. 95
మ. అహులై బుస్సను శత్రుషట్కపుది తావై యొప్పు వల్మీకపు
గ్గహనంబందుఁ జరింప నీశ్వరకటాక్షం బబ్బ చందంబుగా
విహరింపంగల నెందునైన నిఁక, నిర్భీకంబుగా నిండ నా
దహరాకాశము దీన నీవయిఁ బరంధామప్రదీప్తంబుగాన్. 96
క. అన్న న్విని యాచిన్నది 'యెన్నం డిటుసేయఁదగునె? యేమను
కొందో!
తెన్నెఱుఁగని తెలిఁ గియ్యదిమిన్న రసజ్ఞతనె దెన్న మెప్పంగను నే?'
ఉ. పంబినవేడ్క నెట్లు మధుపంబులు గైకొను నాసవంబుఁ లో
కంబు రసప్రలుబ్ధమతిఁ గాంచఁగఁ జెల్లెడు నంతెకాని, రా
గం బెడల స్మరంద మెటుఁ గల్గనివృంతము నల్పిచూచి, శు
ష్కంబులు నల్క నేమిసరసం బనిపించునో! రెడ్డిపుంగవా! 98

ఉ. కుందము లందము ల్గనఁగఁ గోమలనవ్యపరిమళంబుఁ జిం
దం దనియించు నాసికలఁ దన్నికరంబును వేచి త్రింగనా
చందముగా నొనర్చు విరసంబుల నేరు సహింప నేర్తురో!
సుందరత న్గ్రహింపమి వసుంధర చిందరవందరౌఁ గదా॥ 99
మ. పరలోకానఁ దిలోత్తమోర్వసుల రంభామేనకాముఖ్యసుం
దరులం గూడు సురాధిపప్రముఖు లీధాత్రిస్థలి న్మానిరా

ద్వారుఁడై కీరితి కెక్కినట్టి ఘనవిశ్వామిత్రుఁ డింకం బరా
శరముఖ్య స్మృతికర్త లింతటి రసజ్ఞత్వంబుఁ దారంచరే! 100

మ. రవియే న్గాననిదెల్లఁ గాంచఁగలమేర న్గ్రాంతదర్శిత్వ వై
భవముం గాంచి సమస్తశాస్త్రవిదులై భాసిల్లు నానారస
ప్రవణు ల్శాశ్వతకావ్యసృష్టి కలనారంభ ప్రకృష్టాధ్వగుల్
కవు లీమాత్ర మెఱుంగలేమినొకో! శృంగారంబులం గొల్పుటల్.

శా. శీలం బెంచుఁ బరార్థము న్నినుచు నక్షీణప్రభావోదయ
వ్యాలీఢంబుగఁ బూర్ణదీక్షఁ గొను విద్వద్వర్యు లర్చించు న
మ్మూలాధారమహత్త్వ మే మెఱిఁగితో! మూఢప్రలాపంపు జం
బాలం బేయదొ యొంచ కింక సుషమావాల్లభ్యముం గాంచుమా.

మ. సకలాంతఃపరిశోధనైకనిపుణు ల్శారీర సర్వాంగ శో
ధకతోపార్జిత వైద్యశాస్త్ర విహితోద్యత్పాండితీ దక్షులై
న్నకసహ్యం బెటఁ దార్చికిత్సకులె, కాంతాచింతనోదంతమం
తకులై వర్తిల నింత కే మెఱిఁగితో! తన్మూల మిట్లాడ నాఁకా.

మ. అకటా 'మంత్రము పిడ్గుబియ్యమున కొండా నే?' యను న్రెడ్డి 'కే
తకి నెందైనను ప్రీల్చి వంచి తునుప న్ధాశ్యత్వముం గాంచుఁ బూ
జ కెఱు ల్గా దటె లోకమం దెటులగు న్నామ్యం బొకం డొంటికిన్?
'ముకుముం డుండఁగ సాక్ష్య మేమిటి?' కదే న్మ్రాచూడ కెట్లయ్యెగున్?

చ. అనుభవమంది తాత యెదియైనను బోధన మొంతసల్పిన
న్ననుమఁడు పాటు నందమిని మాను నె? తారుమహర్షు లెన్ని వ్రా
సిన మతభేదములు ల్గనరె? చేయఁగ సాగునె ధర్మపద్ధతిం
గనినను సూటిగా నవు నె? 'కానగు నెద్దది కాకమాను నే?' 105

మ. కృతికర్త ల్హిత మబ్బఁజేయుట కెటుం గీలింప శృంగారముల్
ప్రతిపాద్యంబవు నీతిగాక పరమార్థం బద్ది కానేర్చునే?
మెతు కెళ్లినను సైఁపఁజేయుటకునై మేలైనయే వ్యంజనాల్
జతగా, నన్నముగా కవే మెసవ నే? చాలు న్ప్రసగ్రాహముల్,

మ. తెరువున్నాలి యెవండొ నీచుఁ డవినీతింగొల్వఁగా వ్రాయ శం
దురె వానింగవియంచుఁగావ్యమదె? యేదుర్మార్గుఁడొ వెజ్జొ తాఁ
జరియింపంగ వరాహమట్టుల నిరస్త్రాంబానె భైషజ్యవృ
త్తి? రిరంసంగొన గర్హ్యమా, నెవరు సంధీభూతత ల్పాయనౌన్."

## వేమన్న నిర్గమము

మ. అని సన్న్యస్తమనస్కతం దెలుప, వేశ్యారత్నముం దా నను
న్వెనువెంటం జననెంచుట, ల్తగదన న్వేమన్న, రత్నంబు నూ
ఱిన నావిశ్వద; 'తప్పు త'ప్పనుచుఁ బాఱె న్వేమనార్యుం డటో
మన మోదేన్ స్థిరతంగనంగఁ, దొలఁగింపన్నేర్తురే యెవ్వరేన్?

## ఆశ్వాసాంతము.

మ. బుధలోకావన దుష్టదైత్యహర ణాంభోజాతపత్త్రేక్షణే
డ్విధిముఖ్యస్తుత దక్షిణాస్య మననావిర్భూత భాస్వచ్చతు
ర్విధ విఖ్యాత కవిత్వతత్త్వ గరిమోద్యద్విస్ఫూర్జితానన్యల
బ్ధ ధరామండల పండితేంద్ర వినుతిప్రాగ్భారకావ్యావళీ॥ 109

మాలిని: ప్రథమకుల లలామా! భవ్య విద్యాభిరామా!
పృథుల సుపద హేమా! భీతి దాఘాళి భీమా!
ప్రథిత సుగుణసోమా! రమ్య సత్కీర్తి కామా!
బుధకవినుతి ధామా! పూరుషోత్తంస నామా! 110

## గద్యము

ఇది శ్రీమేధాదక్షిణామూర్తీశ్వ రాక్షీణ కరుణాకటాక్ష వీక్షాపాత్ర
నాదెళ్ల పురుషోత్తమ కవీంద్ర పుత్త్ర మేధా దక్షిణామూర్తి శాస్త్రి
నామధేయ విద్వద్విధేయ కర్తృక శ్రీవేమ యోగీయంబునందు
ద్వితీయాశ్వాసము.

# శ్రీ వేమయోగీయము.

## తృతీయాశ్వాసము

క. రఘువర్ధి సుజనమిత్రా! శిక్షాగర్వ దితిజపవిత్ర శిష్టచ్ఛాత్రా!
మోక్షాభ్యుపగమ పాత్రా! దక్షాఖిలనుత పవిత్ర! ధన్య
చరిత్రా! 1

వ. విశ్వదాగారంబునుండి యట్లు నిర్గమించిన శాశ్వతాపవర్గమార్గా
న్వేషియు మనిషి త్రైకసంతోషియు నై వేమాఖ్య విజ్ఞానాభిలాషి
యాపైనే మాయెనన్న, 2

శా. 'శ్రీమత్తన్మదమత్తతన్ధనము నిస్సీమంబుగా దోఁచి వే
శ్యామోహోద్ధతి వెచ్చపుచ్చితిని నిస్సారం బిదం చెంచు, నిం
కేమంచు న్మదినెంచునో! పిదపఁ దా నేమార్గముం ద్రొక్కునో!
ధామంబుం దరియం జనం డతనికై తాపంబు స్వీయు ల్గనన్॥ 3

చ. నదినె,మఱంది'యింత యిలుపట్టక మానెనె?'యనుచుఁగుంది, మే
లొదవునెదో యటంచు నొకయూహను బోవ మఱొక్కటయ్యె'నే
మిది?' యని యాడ నిడ వెదకింప నిజాధిపుతోడఁ జెప్పి 'యెం
దు దొరకదయ్యె జాడ' యని దుఃఖితయై కృశియింపఁ జొచ్చెఁ
దాన్॥ 4

సీ. కడగొట్టు బిడ్డండు వెడలిపోవఁగఁ దల్లి
మల్లాంబ తినమాలి మంచ మెక్కెఁ
దనతమ్ముఁ డిలుదోఁచికొని పోవ సైఁచిన
యన్న గృహచ్ఛిద్రి మంది పొగుల
నాబాల్య మెఱిఁగిన యాప్తు లాతని యోగ్య
తాధిక్య మెంచుచు నరయుచుండఁ
జట్రాలు వేఱొక్క సుందరాంగినిగొంచు
లేచిపోయెనో యంచు లేవడియన॥

తే. దాసదాసీజనుల్ లోఁగి తల్లడిల్ల
విన్నవారెల్ల ముక్కుల వ్రేళ్లు నిడఁగ
నంతుచిక్కమి సందియం బాస లుడుగ
వింతయెదయంగ నేంగ్లేగ, వంత యడఁగ॥ 5

వానప్రస్థుఁడు

సీ॥ భూమీరుహస్తోమ పుంజీభవ ల్లతా
బహువిధ ఫలపుష్ప భరితమాచు
స్వేచ్ఛావిహారైక జీవితాశయభూత
ధారాళ జంతుసంతాన మాచు
నిర్మిత శాఖికా నిజకులా యోద్గమ
శ్రవణీయ రుత పక్షిజాల మాచుఁ
గ్రిమికీటకానీక కృతసృష్టమూలోత్థ
లేలిహా నాత్తవల్మీక మాచు॥

తే॥ నిర్మల జలాశ్రయోద్గాఢ నిలయమాచు
భ్రష్టతరుపర్ణ సంకీర్ణ వసుధమాచుఁ
గందరాంతస్థ యోగీశ కలితమాచు
నుడఁ గుండినపరిసరం బొండువనము॥ 6

మ. తనయి ట్లేగఁగ మోముచెల్లమిని యూదాశ్రియుదత్రోద్రావ హ్రా
న్నినదంబేర్పడి కాళలీప్వ నెటకే న్నిర్ధార్యథైర్యోన్నతిన్
శనిదాసమ్మును గొన్నమై వెనుకకు న్సారింపకే దృష్టి, వే
మన దా నావనభూమిఁ జేరి కనె వేమధ్యాన చింతారతిన్॥ 7

చ. అనితరగమ్య మెద్దియని యారసి యారసి చేర నాతఁడ
ప్వనమున మాఱుమూలఁ దగువాని నెవండును గానఁడయ్యె, దా
పునసె గుహాంతరమ్మునఁ దపోమహిమాఢ్యుఁ డొకం డెసంగ, న
య్యనిలముఁ బీల్చు సత్త్వములు నయ్యెను సత్త్వమయమ్ము
లెమ్మెయిన్॥ 8

చ. వనములు కొల్ల నిట్లు నిరపాయము లెట్లవు? భీతిఁ గొల్పు తా
వన, ములుకంప లున్నత మహాతరుజాలము క్రూరజంతు జీ
వనములుగా మృగావళి యవార్యపు హింసకు నాకరంబ, పా
వనములుగా నహింసకు నివాసములై యిటు లేడఁ గానన? 9

చ. ఎద నెదొ చింతతోఁ గదల నేమిది? బాటను దప్పినట్టులై
పదము లిటీడ్వ నేమిటికి? వచ్చెను బో యట సుస్థిరంబుగా
నొదిగి వసింప నేమిటి కహో! యిల నేరికిఁ గల్గు సంపదా
పదలెవి పూర్వకర్మపరిపాకమునం గద ప్రాప్త మయ్యెడున్. 10

ఉ. ఏవిషయాతురు ల్గనఁగ నింతకె మంతన మెంతొ మాఱి, సం
భావితమానిమార్గులయి వర్తిలఁ జూతురె? పూర్వపుణ్య వి
ద్రావిత మోహపాశుఁడయి తా నిఁక త్రొక్కఁగఁ జాలెఁ గాక, వి
ద్యావినయాఢ్యు లేవయిన సబ్బెనె? నిబ్బర మింత యుబ్బఁగాన్.

ఉ. కాననియప్డు జన్వనుల గచ్చులు మచ్చులు నుచ్చులైన, లో
కాన, నిటు ల్విరాగితను గన్న, మఱెన్నఁడ కెన్నకున్న నీ
కాన, నివాస మందఱకుఁ గల్గునె? కానని దేదొ వెన్కకిం
కాననియ ట్లొనర్చిన నహంకృతి వీడినఁగా కదందునే? 12

ఉ. సంసృతిలో మునింగి విరసమ్మదిగా మదిరోసి పాసి యే
పాంసులతోడి పొత్తులకుఁ బాంసనుఁడై గహనాంతపాంసులన్
బాంసువు గప్పియున్న రతన మ్మనవొప్పిన వానిచంద మే
హంసుల కందమిం బగమహంసలముం దెదిడాఁగ నేర్చునే? 13

మ. అవుఁగా కొందును విత్తు భూమిఁ బడనే యబ్బ న్ఫలం బెట్లవున్?
మివులన్మాఁగి నవాంకురోదయము, నామీఁదం దగ న్మొక్కగా
నవు నంతంతకు వృక్ష మయ్యదియె యన్వర్గంబైన కాలంబునం
బువులుం బిందెలుఁగాయలీ ఫలములం బొందించునిం దెయ్యెడన్.

ఉ. చేరినమాత్రి నేరికిల సిద్ధి లభించునె? యేడనైన సాం
సారికబంధము ల్త్రెగి, యసార మిదంచు దృఢంబుగాఁగ ముక్తి

గూరునవిద్య మాయ నడఁగుం దగుపాత్త కృతిప్రకృత్యాదా
హారము బ్రహ్మయుక్తి నన, నాత్మవిభేదము కర్తృభోక్తృతల్.

మ. కరము న్దుస్తర మింతవట్టు నని దుఃఖంబాఱి నాచార్యుల
బ్ధి రిరక్షాప్తి వినష్టితోల్లసము సంధిల్లం గదా యబ్బెడున్
బరమానంద రసస్వరూప విలస ద్బ్రహ్మానుసంధాన, మా
పరిపక్వత్వముఁ గూర్చు సద్గురులు లభ్యంబౌట లెవ్వారికో! 16

శా. తత్కర్మోదిత పూర్వసంచితమునం దా నిష్ఠ విప్రత్వము
న్యత్కించిత్సుకృతమ్మునం గనిననే యబ్బుం దుద న్బ్రహ్మసా
క్షాత్కారంబని యెంచ నేల, సమమై జన్మానఁ? దత్త ద్భిదా
కుత్కీలమ్ములు కల్పితమ్ము లవియేగు న్సిద్ధవ్రజస్మృతిన్॥ 17

మ. వెతక న్బ్రాక్తనగాథలం దెవఁడో చెప్పె న్ధర్మలోపంబు శూ
ద్ర తపోనర్థక మార్చె రాముఁ డనుటల్ తథ్యంబుగానైన, సం
చితపుణ్యాప్తి గురూపదేశ మొదవం జిన్మూర్తి సాక్షాత్కృతి
న్వాతమైపోక కులంబు లడ్డెడినె ? మిథ్యాభూత మిద్ధాత్రిలోన్

ఉ. భూతలమందు వ్యాఘ్రుఁడను బొట్టకనేసుల హింససేసినం
జేతమునాఁటి నొప్పటికొ చింతితవృత్తి 'మ' గోపదేశమే,
జాతసుహత్త్వ ముత్థిత లసత్కృతితత్త్వము కాదె మున్న ప్రా
చేతసునందు నట్లె నరిసె న్మనవేము ప్రసిద్ధిహేతువున్. 19

శా. ఎంతోకాలము చింత చేసినను ప్రాప్తించు న్మనీట్సత్కృపల్
శాంతి న్దాంతిని మంత కానయిన ప్రశాంతం బటు ల్నిల్వఁగా
నంతేవాసి నొనర్చికోఁ గను కటాక్షాయత్తచిత్తంబునం
గాంతం బెట్టు లయస్సు నట్టులనె యాకర్షింత్రు యోగీశ్వరుల్ 20

ఉ. జ్ఞానదమైనబోధము నొసంగి సముద్ధృతిఁ గూర్పఁజాలు వి
జ్ఞానులు లభ్యమౌకొఱకుఁ జాతకపాళి ఘనాగమార్థ మె
ట్లూను నిరీక్షణంబు నటు లోపిక దీపితమైనవట్లు కాఁ
గా నిధిలభ్యమౌ కరణిఁ గల్గెడుజ్ఞానుల దర్శనంబిలన్. 21

తే. ఓటునందమి నెందైన నీ టడగునె?
పాటుసేయమిఁ దగురీతి నాటుకొనునె?
యర్థ తప్తత నందమి నదుకువడునె?
'యేపుచచ్చిననే కాని కా పొదవునె'? 22

సీ. పంచభక్ష్యాన్నాల వరిఘ్లినాతండె
దొరకిన యేపండొ కొఱికి బ్రదికెఁ
జీనాంబరాల్గట్టి చెన్నొందినాతండె
కట్టఁ బుట్టము లేక యట్టె యుండెఁ
బునుగు జవ్వాదుల్కఁ బూసినయాతండె
మైని జెక్కులుగట్ట మాసియుండెఁ
బరిమళ తైలాలఁ గురులదిద్దు నతండె
జడలయి వ్రేలాడఁ గడలఁ దొడఁగె.

తే. తురికముట్టమి శ్మశ్రువు త్వరఁగిపోయెఁ
గండ లన్నియుఁ గరిగి బికారియయ్యె
మేలిపఱుపుల నుడిగి యా నేల నొరిగి
భోగి యిట్టులఁ దుదకు బైరాగి కాఁగ॥ 23

సీ. అనవరతం బపక్వాహార భక్షణ
నంటు నీడఁగఁ గోశ మన్నమయము
ననతిదూరస్థ గుహాయోగి సంస్పృష్ట
వాతపూతముగాఁగఁ బ్రాణమయము
తదగోచ రోత్సృష్ట ధామదీప్తి నితాంత
సౌమనస్యముగ మనోమయమ్ము
తిమిరాపనోదక ధీధితిప్రదవిద్య
తానకం బంద విజ్ఞానమయము॥

తే॥ ననువుపడఁగ నానందమయమ్ము నెనయ
నెప్డు డోనంచు నుంకించు చెంచుకొంచుఁ

బట్టుకొమ్మకు వెదకెదు పట్టునందు
నరయఁ బాడకట్టెఁ దెరువు వేమన్న కిట్టు॥ 24

శా. ఘోరారణ్యనివాస మేండ్లుసలుపన్ ఘోరత్వ మేసత్త్వమం
దేశిం గనరా దిదేటిమహిమం ? బెవ్వారి దైయుండు? వె
ట్లో రాన్నైతిని, వ్యర్థమయ్యె నిటు లెంతేకాల మెందైన, నా
ధారంబై, నను నుద్ధరింపఁగల మేధావంతుడై చూడనే ! 25

చ. కలరు మహానుభావు లెటఁ గానన సీమ గుహాంతరంబుల
న్నెలవులుగాఁగ నంచు విననేర్చి ప్రశాంతమహాస్థలిం గనం
గలిగి వసించుచు న్మహితు గహ్వరమం దెటనైన నారయం
దలఁపనె? యేటిమాంద్యమొకదా! యిపుడైననుఁ గాంతు నేడనేన్॥

వేమనకు శివయోగీంద్రుల సందర్శనము

చ. అని బహుళార్తిఁ బోవఁ గననయ్యె నొకానొక కందరంబుఁ జొ
చ్చిన యభిరాముఁ డేగుటను, జెచ్చెర నచ్చోటు డాయనేగి, యం
దును జొరఁబోవనే యమితశోష మదేమొకొ హృద్వికాసముం
గనఁగ నిజాంగము న్గగురుఁ గంపము నిండఁగ హర్షబాష్పముల్.

మ. చనఁగా లోనికిఁ గాననయ్యె నచోట న్సత్త్వమ్మె మూర్తీభవిం
చినచందంబున నున్నవాని జటిలుఁ జీర్ణాంగుఁ బూర్ణేందు కాం
తి నిధాను, న్సుమనోమనోజ్ఞ నిలయోద్గీర్ణ ప్రభోద్గూర్ణునిం
గనదుత్తేజిత వాతపూత నిఖిలౌక స్స్వీయ దుత్తీర్ణునిన్ 28

మ. అవురా ! యేమిమహావిశేష మిది డాయ న్శక్యమెవ్వారికో !
రవిచంద్రోడునిభం బిదన్యనభమై క్రాల న్దివం బేటికిన్ ?
దివురంగల్గినతావు నేఁటి కిదె యందె న్జెంద నుత్తీర్ణత
న్శివయోగీంద్రులు వీరెకావలెఁ గటాక్షింపం బదం బందుదున్.

మ. అని సాష్టాంగనమస్క్రియాన్విత గురువ్యాసక్త చిత్తస్థితి
న్ముని రాజేంద్రుని పాదసన్నిధిని వేముం డప్డు ధ్యానించుచుం
దన కేదారిఁ దరింపఁ జూపు నదె యందంగోరి యర్థించు నీ
వినుతి న్సల్పె నిమీలితాక్షుఁ డవుచు న్విజ్ఞానసిద్ధిం గనన్. 30

కుమారలలిత : అహో దళితకామా! మహోవిదితధామా!
పరిహృష్ట నతలోకా! మహత్తర వివేకా!

స్రగ్విణి : వామదేవుండవో! వాసుదేవుండవో!
స్తేమభావుండవో! దివ్యభావుండవో!
ధీమనోజ్ఞుండవో! దేవదేవుండవో!
నామది న్నిండవో! నారమై యుండవో! 32

దోదకము : నీ పజుఁడంచును నే మదినెంచన్
భావజుఁ ద్రుంపవె భవ్యతఁ గాంచన్
సేవకునై దరిఁ జేరిన వారిన్
బ్రోవవె యార్తిని బొందిన యేరిన్ 33

భుజంగప్రయాతము : దరీమధ్య సంచార! ధర్మప్రచారా!
చిరాభ్యస్త నిస్తార! చిత్రప్రకారా!
పరాస్త ప్రజానీక! వశ్యప్రతీకా!
పరీరబ్ధ మోక్షైక భాస్వద్వివేకా! 34

మత్తకోకిల : ఓమహాత్మ! జితారివర్గ పటుచ గోడుమండలనీధితీ!
సోమ శేఖరతా సమంచిత సుంద రోపచి తాకృతీ!
నీమహత్త్వ మెఱుంగ నెయ్యెడ నిష్ఫలుం బొనరింపవే!
వేమనం బెరు వేమనన్ దరి వేమనం గరుణింపవే! 35

వ. అని యివ్విధంబున సిద్ధసందర్శనారబ్ధ వాక్సిద్ధి ప్రచారంబు కొంత
యైనంతనే.

సీ. అజ్ఞానతమమున కర్కా ప్తకిరణమ్ము
శ్రేష్ఠమోక్షైక నిశ్శ్రేణిపథము
ననుభూతఫలమ్ము లందురసాలమ్ము
నపరోక్షసిద్ధికి నంజనమ్ము
నణిమాదిసిద్ధుల కాధారభూతమ్ము
నాధిబాధలకు దివ్యౌషధమ్ము

మహితవేదాన్తార్థ మంథాయమానమ్ము
భవమహాంభోనిధి ప్లవవరమ్ము,

తే. సకలపాపౌఘ పంకిల జల కతకము
భేదదృష్టి సమూల విచ్ఛేదకమ్ము
'తత్త్వమసి' భావ సిద్ధి సంధాయకమ్ము
హస్తమస్తక సంయోగ మయ్యెనపుడు. 37

శా. అంత న్స్వాంతగ మంతనం బెనయ వేదాంతంబు స్వాంతంబునం
దంతర్వాహినిగాఁ బ్రసారమొదవ న్ధ్యాతవ్య తేజోమయ
స్వాంతర్యామి ప్రకాస్తిఁ గాంచ, విగతభ్రాంతిం బ్రశాంతాత్ముఁడై
యంతేవాసి తగ, న్మనీనుఁ డిడెడు న్వ్యాకోశ మభ్యాశమై. 38

వ. అప్పు డేర్పడిన యాత్మప్రబోధ స్వరూప మ్మెట్టిదనిన, 39
వేదాన్త సారోద్ధార రూప గురుప్రబోధము.

ఆ. నిత్య మేది యనిత్య మత్యంత మారసి
యిందు నందు ఫలములందరక్తిఁ
గనఁగ శమదమాదులను ముముక్షుత నందు
విశ్వతోభి రామ వినుర వేమ. 40

ఆ. బ్రహ్మసత్యతా ప్రపంచమిథ్యాత్వముల్
కనుచు విషయ తతులఁ గాంక్షలుడుగు
మింద్రియోపరామ మెనసి తితిక్షయుఁ విశ్వ...... 41

ఆ. శాస్త్రసద్గురూక్తి సత్యత్వమెంచి బ్ర
హ్మమున హృది నిలుప నహంకృతి సన
భక్తి నందఁ గందు స్వాత్మతత్త్వంబును।విశ్వ...... 42

ఆ. కన నవిద్యఁ గామకర్మాదిబంధముల్
సనవు కర్మయోగ సాంఖ్య విద్య
లందఁ జనెడు బ్రహ్మ మాను దాననుబోధ।విశ్వ...... 43

ఆ. కనమిఁ దత్త్వ మాగమ నిరంతరాభ్యాస
వాదపటిమ లెల్ల భ్రమముఁ గొలుప
నాను మందు జ్ఞాన మజ్ఞానరుజఁ బాపు। విశ్వ...... 44

ఆ. మందిదంచు నెన్నిమార్లన్నఁ దినమిని
వ్యాధివాయ దట్లె 'బ్రహ్మ' పఠన
వ్యర్థ మందకున్న నపరోక్షదృష్టిని। విశ్వ...... 45

ఆ. తాని జేఁడ నన్నఁ గానోని జితకాశి?
'బ్రహ్మమ'నన ముక్తి ప్రాప్తమౌనె?
యాత్మతత్త్వ మట్లె యగపడునది వోమి। విశ్వ...... 46

ఆ. స్థలవిదుండు తెల్పఁ ద్రవ్యాన నిధియబ్బుఁ
దత్త్వవేత్తృబోధ ధ్యానగరిమఁ
బాయకున్న మాయఁ, బరతత్త్వ మందునే? విశ్వ...... 47

ఆ. తొలి విరక్తి భోగ్యముల, శమదమతి తి
తిక్షలయి, శ్రవణమననములను ధ్యాన
నిర్వికల్పతాప్తి, నిర్వాణ మిందబ్బు। విశ్వ...... 48

స్థూలదేహస్వరూపము

ఆ. పాంచభౌతికముగఁ బ్రభవిల్లు స్థూలదే
హమున సుఖము దుఃఖ మమరఁ జేయుఁ
బంచవిషయము లిలఁ బంచతన్మాత్రలై। విశ్వ...... 49

ఆ. రాగములను దుర్గింప రా కింద్రియార్థముల్
కర్మమందుఁ దోడుగా నడవఁగ
జడులు దొరలుచుందురి సంసృతి లోనికే। విశ్వ...... 50

ఆ. వినఁగ నంటఁ గనఁగఁ గొన రసంబుం దావి
మెకము నేనుఁ గీఁగ మీనుఁ దేఁటి
యొల్ల నరుఁ డివన్ని యొనసి నశింపఁడే? । విశ్వ...... 51

ఆ. విషము మ్రింగఁ జచ్చు, విషయంబొ కన్న నే
యడఁచి విడువనీయ దుడుగ ముక్తి
కామిఁ జదువు లెన్ని కావుపఠానను|విశ్వ...... 52

ఆ. ఆసమొసలి ముంచు నడఁపమి విషయాబ్ధి
హితమువినమి భ్రమంద కెనయ ముక్తి
హర్ష శాంతిదయల నందుకుమార్గవాల్|విశ్వ...... 53

ఆ. విడకవిద్య కొడలి కిడుటాత్మహతి, నక్రి
మంది యేటి దాఁట నరయునట్లు
దారసుతుల మోహ మారీతిదేసుమ్ము|విశ్వ...... 54

ఆ. జీవుగృహము దేహ మీ వనుభ్రాంతిచేఁ
బొరయు దిందిరియాళి భోగతతులఁ
గుల మవస్థ స్తుతియు నులకనఁ గనువిందు|విశ్వ...... 55

సూక్ష్మశరీర వివరణము

ఆ. కలవు గదవె జ్ఞాన కర్మేంద్రియావళి
యంతరింద్రియం బదన నొకటె, ప్ర
వృత్తి, మనము బుద్ధి చిత్త మహంకృతి|విశ్వ...... 56

ఆ. 'మనము' సంశయయుతిఁ, గన నిశ్చయము 'బుద్ధి'
యా 'నహంకృతి' తను వాత్మగఁ గొనఁ
బ్రత్యభిజ్ఞఁ జిత్తవైషయికం బందు|విశ్వ...... 57

ఆ. ప్రాణపంచకంబు జ్ఞానకర్మేంద్రి యా
కాశముఖ్య కామకర్మములు న
వున్మన మ్మవిద్య పుర్యష్టకాఖ్యముల్|విశ్వ...... 58

ఆ. దేహి సూక్ష్మతను విదే యపంచీకృత
భూతవాసనోత్థ భోగకర,మ
నాద్యుపాధి కాత్మ స్వాధ్యాసమునఁ గలఁ|విశ్వ...... 59

ఆ. జీవుఁడా స్వమాత్రశేషుఁ డిలింగానఁ
గర్తృభోక్తృ భావగ మిటుబుద్ధి
గాఁ బరాత్మ స్వప్రకాశ మిందు వెలుంగు|విశ్వ...... 60

ఆ. చిత్స్వరూపుఁడైన జీవుం డసంగుఁడే
తా నశేషసాక్షిగా నుపాధి
కర్మమంట దాత్మధర్మ మిం దెదికామి|విశ్వ... 61

ఆ. అంతరింద్రియము చిదాభాసతేజమ్ము
నంది తనదన, నె దహంకృతిదగు
ద్వంద్వరహితమా సదానందమయ మాత్మ|విశ్వ...... 62

ఆ. విషయతతులకంటెఁ బ్రియతరం బాత్మయే
యివి లయింప నిద్రయే సుఖంబు
గదవె ప్రాణికోట్ల కుదితానుభూతిని|విశ్వ...... 63

ఆ. కల దనాద్యవిద్యగా జగత్కార ణా
వ్యక్త మనఁగమాయ, పాము కామిఁ
ద్రాటి మెఱుక నట్ల తగుఁ ద్రిగుణాత్మత| విశ్వ...... 64

ఆవరణ విక్షేప శక్తులు

ఆ. కామమాత రజము గాఁగ విక్షేపశ
క్తిని బ్రవృత్తికీడ్చు దీన జగము
రాగదుఃఖ బద్ధతా గతి లోఁగెడు|విశ్వ...... 65

ఆ. పొరపడంగ జడతఁ బొరయఁ దమోవృతి
వస్తుశంకఁ గొలుప భ్రాంతి దాని
విడమి సంసృతిఁదగు విక్షేపశక్తి చే|విశ్వ...... 66

ఆ. ఆత్మ ప్రతిఫలింపనా శుద్ధసత్త్వంబు
శాంతిహర్షములుఁ బ్రసత్తిఁదృష్టి
కాత్మనిష్ఠ కిర విదానందసుధఁ గ్రక్కు|విశ్వ...... 67

ఆ. సాధకతను మిశ్రసత్త్వానను, యమాభ
యాదిక మ్మమానితాదు లింద్రి
యార్థవిరతి, మోక్షమం దపేక్షయు శ్రద్ధ|విశ్వ...... 68

కారణశరీర స్వరూపము.

ఆ. ఔను త్రిగుణయుక్త మవ్యక్తమే కార
ణతను వాత్మ కింద్రియతతి బుద్ధి
వృత్తు లడఁగు నిద్ర పృథగవస్థ య దిందు।విశ్వ...... 69

ఆ. వీడఁ బ్రిమితి బుద్ధిబీజాత్మతన యునికి-
గా 'సుషుప్తి' నిద్రఁ గంటి సుఖము
నెఱుఁగ నేమి యంట మెల్లర యనుభూతి।విశ్వ...... 70

ఆ. ఔ ననాత్మ యలమహత్తత్త్వ తత్కార్య
తను హృషీక భూతతతి వికృతులు
విషయసమితి మాయ విశ్వ మ్మిదెల్లను।విశ్వ...... 71

ఆత్మస్వరూప నిరూపణము

చ. అనవుడుఁ గేలుమోడ్చి యమితాస్థ విన న్మనమందు మున్ను గూ
రిన ఖసుమంబులు న్మరుమకీచిక లాఁగఁగ, బంధమోక్షమై
కన నమృతత్వ మెట్లొ యెఱుఁగం గడు సంభ్రమ మందు వేళ న
మ్మునివరుఁ డిట్లు వేసనక మోఘముఁ దెల్పెడు నాత్మతత్త్వమున్

సీ. వ్యాప్తుఁడై యెవఁడు తా నఖిలవిశ్వంబున
వెలుఁగిచ్చి సర్వంబు వెలయఁ జేయుఁ
జేతనత్వ మిసందు చేకూర్చి బుద్ధిలో
వృత్త్యస్తినాస్తుల వెర వొరసెడు
నెగడెడు నెవ్వండు నిత్యబోధాకృతి
నవికలముగ విషయముల నెందు
సాక్షియై యెవఁ డవస్థాత్రియమ్మున నిత్యుఁ
డౌ తా నహంప్రత్య యాశ్రయుండు.

ఆ. పరఁగు నాత్మ నాఁగఁ బంచకోశాతీతుఁ
డతఁడ దేహ మింద్రియములు మనము
బుద్ధి స్వస్వవిషయములఁ బ్రవృత్తికిఁ గొల్పు।విశ్వ...... 73

ఆ. సత్తు చిత్తె సంగు సత్త్వాత్మధీకంద
రమునఁ బురుషుఁడు న్స్వరాణుఁ డతఁడు
నవ్య తేజమిచ్చు నవ్యాకృతస్థితి। విశ్వ...... 74

ఆ. ఇనుము ననల మొనసి యెసమ్మెటము నొచ్చ
నట్ల యాత్మఁడింద్రియాళి మెలఁగి
కాంచఁ డేవికృతియుఁ గనఁ డేవిచేష్టయున్। విశ్వ...... 75

ఆ. సృష్టి స్థితియు లయముఁ జెందఁడే వికృతియుఁ
గుండ పగుల మారకుండు మింటి
వడువుననె మెసంగు ప్రకృతిభిన్నుఁడు తాను। విశ్వ...... 76

ఆ. 'అహ' మటన్న భ్రమము నాత్మసంసృతి తంతు
వులను గీటకంబు వలెను బెంచు
బంధ మద్ది త్రెంప బ్రహ్మత్వమబ్బెడు। విశ్వ...... 77

ఆ. అర్కు రాహు వట్ల 'యావృతి'య స్తమో
మయి యఖండబోధు మాప నాత్తు
వెతలఁబుచ్చుఁ గామ 'విక్షేప' బంధముల్। విశ్వ...... 78

ఆ. గ్రాహమట్లు మ్రింగ మోహాం బసద్గ్రాహ
బుద్ధ్యవస్థ జలధి మునిఁగి తేలు
వితమె యింద్రియార్థ విషపూర సంసృతి। విశ్వ...... 79

అ. ఇనునివలనఁబుట్టి ఘనుఁడయ్యు యినుఁగప్పు
నాత్మ నుదితమహా నహంకృతియటు
లాత్మనే గ్రసించి యార్చెడుఁ దొంగలూఁద। విశ్వ...... 80

చ. భవతరుబీజమౌఁ దమము, పైమెయి తానను బుద్ధి మొలక, రా
గవికచమే దళంబు, నుదకంబవుఁ గర్మము, మేనె బోదె, వా
యువుతె ప్రలంబము, ల్శిరము లొప్పు హృషీకములు, న్సుమాళికాఁ
గ విషయము ల్ఫలంబుగఁ దొంగం గొను జీవఖగంబు వేమయా। 81

ఉ. ఏది యనాత్మబంధ మెది యెంచ నవిద్య యనాద్యనంతని
త్యోదయ దుష్కృతిప్రభృతి దుఃఖతరంగ నిబంధన మ్మెటే

న్గాదది మాప వాతహతిఁ, గాల్చినఁ గోసిన నుగ్గుసేసినం
బోఁదగు జ్ఞానఖడ్గమున బోధక దివ్యకటాక్ష లబ్ధి చేన్॥ 82

ఆ. ఆగమోక్త కర్మ మాచరింప స్వధర్మ
నిష్ఠ నాత్మశుద్ధి నెగడ నబ్బుఁ
దత్త్వ మడఁగిపోవ దానసే సంసృతి॥విశ్వ...... 83

కోశపంచకప్రస్తావము

ఆ. ఆత్మశక్తిఁ గలుగు నన్నమయాదులు
ప్రాచి నూత నీటిఁ బగిదిఁ గప్పుఁ
బాపఁ దృష్ణ నడఁపఁ బ్రత్యగాత్మ వెలుంగు॥విశ్వ...... 84

ఆ. ముంజ నెడపు దర్భ మొగిఁ బ్రత్యగాత్మ న
నాత్మ నుడిపి తా నదంచుఁ గనన
సంగు నక్రియునిఁగ, సచ్చిదానందమూ॥విశ్వ...... 85

అన్నమయకోశము

శా. అన్నాధారముఁ గర్మలంబవుచు దేహం బెందు మార్పొందెడున్
మున్నా లే దది యుండదఁ, జూడ జడ, మాత్మం దే వికారంబు లే
నెన్నం డందని తన్నియంత కనుఁ దా నీధర్మ కర్మంబులం
చెన్న న్భిన్నవిలక్షణస్థితి, నదిదే బ్రహ్మసర్వాత్మతన్. 86

శా. నీనీడ ప్రతిబింబ మం దెటుల స్వవ్యాప్తిభూత మహామూర్తిలో
లో నూహించు నిజస్వరూపమున నెట్లుం గాంతె 'నే' నంచు, న
ట్లే నీమేనను నాత్మబుద్ధి కన వే, నేలీల నొక్కింత మో
హానన్, జన్మము నీకు లే దిఁకను మోక్షావాప్తియౌ వేమనా.87

ప్రాణమయకోశము

శా. ప్రాణం బన్నమయంబుఁ జేతనము నర్పం గల్గఁ గర్మేంద్రియా
ధీనంబై వెలి లోఁజరించు నెటుఁగ న్దేని న్దన న్గానిదా
దాని న్వాయుమయంబు మంచిచెడుగు ల్దానింత గుర్తింపఁగా
నూనం జాలని దాని నాత్మయని యే రూహింతురో! వేమయా॥

## మనోమయకోశము

సీ. మనము జ్ఞానేంద్రియా లెనయ మనోమయం
బేను నా దను వికల్పానుగతిని
బలిమిమై నామరూపములఁ గల్పించి, ప్రా
ణమయమున విజృంభణంపుద్రఢిమ
వ్రేల్చున దింద్రియా ల్విషయమ్ములె ఘృతమ్ము
గాఁ, దోఁటి తలఁపులఁ గట్టెలచితిఁ,
గాల్చు లోకా ల్జన్మకారణం బ వవిద్య
యడఁగ విజృంభింప నడఁగు నెచ్చు॥

ఆ. నేదిలేనికలనె యెన్నొ కల్పించుమై
మెలఁకువనగు, నిద్రఁ దొలఁగు నన్ని
లీన మైనమనము లేనె లేదు భవంబు।విశ్వ...... 89

ఆ. క్రిమ్మ నూడ్వ మబ్బు గాలి యాగతి మనం
జెనయ మోహ రజ్జువునను గట్టు
విషయవిషతఁ గొల్పి వెతలార్చు ముక్తిగా।విశ్వ...... 90

ఆ. హృది రజఃప్రవృత్తి నెనయు బంధంబును
దానిఁ దమము నుడుగఁ దార్చుముక్తి
విషయ వనతరస్వి విలయంబుఁ గూర్చురా।విశ్వ...... 91

ఆ. స్థూల సూక్ష్మ విషయ జాలంబు దేహ వ
ర్ణాశ్రమములు జాతు లనువిశేష
ము, గుణ కర్మ హేతు ముఖఫలా ల్హృది సృష్టి।విశ్వ...... 92

తే. ఎదియు నంటని చిత్తుమోహింపఁ గట్టి
కూర్చి దేహేంద్రియప్రాణ గుణతతులను
మనమె తనసృష్టి ఫలభుక్తి నెనయఁజేసి
'నేను' 'నాయది' యనిపింప నౌను వేమ. 93

తే. జనుని సంసృతి యధ్యాస సంఘటితమ
యట్టి బంధముఁ గొల్పునదా, మనంబె

న్గాదది మాప వాతహతిఁ గాల్చినఁగోసిన నుగ్గుసేసినం
బోఁదగు జ్ఞానఖడ్గమున బోధక దివ్యకటాక్ష లబ్ధి చేన్॥ 82

ఆ. ఆగమోక్త కర్మ మాచరింప స్వధర్మ
నిష్ఠ నాత్మశుద్ధి నెగడ నబ్బుఁ
దత్త్వ మడఁగిపోవ దానసే సంసృతి।విశ్వ...... 83

కోశపంచకప్రస్తావము

ఆ. ఆత్మశక్తిఁ గలుగు నన్నమయాదులు
ప్రాచి నూత నీటిఁ బగిదిఁ గప్పఁ
బాపఁ దృష్ణ నడఁపఁ బ్రత్యగాత్మ వెలుంగు।విశ్వ...... 84

ఆ. ముంజ నెడపు దర్భ మొగిఁ బ్రత్యగాత్మ న
నాత్మ నుడిపి తా నదంచుఁ గనన
సంగు నక్రియునిఁగ, సచ్చిదానందమౌ।విశ్వ...... 85

అన్నమయకోశము

శా. అన్నాధారముఁ గర్మలంబవుచు దేహం బెందు మార్పొందెడుగ్
మున్నా లే దదిమందఁ, జూడ జడ, మాత్మ్కా డేవికారంబులే
నెన్నం డందని తన్నియంత కనుఁ దా నీధర్మ కర్మంబులం
చెన్న న్భిన్నవిలక్షణస్థితి, నదిదే బ్రహ్మసర్వాత్మతన్. 86

శా. నీనీడ న్ప్రతిబింబ మం దెటుల స్వప్నీభూత మహామూర్తిలో
లో నూహించు నిజస్వరూపమున నెట్లుం గాంతె 'నే' నంచు, న
ట్లే నీమేనను నాత్మబుద్ధి కనవే, నేలీల నొక్కింత మో
హానన్, జన్మము నీకులే దిఁకను మోక్షావాప్తియౌ వేమనా.87

ప్రాణమయకోశము

శా. ప్రాణం బన్నమయంబుఁ జేతనమొనర్పం గల్గఁ గర్మేంద్రియా
ధీనంబై వెలి లోఁజరించు నెటుఁగ న్దేని న్దన న్గానిదా
దాని న్వాయుమయంబు మంచిచెడుగు ల్దానింత గుర్తింపఁగా
నూనం జాలని దాని నాత్మయని యే రూహింతురో! వేమయా॥

### మనోమయకోశము

సీ. మనము జ్ఞానేంద్రియా లెనయ మనోమయం
బేను నా దను వికల్పానుగతిని
బలిమిమై నామరూపములఁ గల్పించి, ప్రా
ణమయమున విజృంభణంపుదర్ఢిమ
ప్రేల్చున దింద్రియా ల్విషయమ్ములె ఘృతమ్ము
గాఁ, దొంటి తలఁపులఁ గట్టెలచితిఁ
గాల్చు లోకా ల్జన్మకారణం బ వవిద్య
యడఁగ విజృంభింప నడఁగు నెచ్చు॥

ఆ. నేదిలేనికలనె యెన్నొ కల్పించుమై
మెలఁకువనగు, నిద్రఁ దొలఁగు నన్ని
లీన మైనమనము లేనెలేదు భవంబు॥విశ్వ...... 89

ఆ. క్రిమ్మ నూర్ధ్వ మబ్బు గాలి యాగతి మనం
బెనయ మోహ రజ్జువునను గట్టు
విషయవిషతఁ గొల్పి వెతలార్చు ముక్తిగా॥విశ్వ...... 90

ఆ. హృది రజఃప్రవృత్తి నెనయు బంధంబును
దానిఁ దమము నుడుగఁ దార్చుముక్తి
విషయ వనతరస్వి విలయంబుఁ గూర్చురా॥విశ్వ...... 91

ఆ. స్థూల సూక్ష్మ విషయ జాలంబు దేహ వ
ర్ణాశ్రమములు జాతు లనువిభేద
ము, గుణ కర్మ హేతు ముఖఫలా ల్పాది సృష్టి॥విశ్వ...... 92

తే. ఎదియు నంటని చిత్తుమోహింపఁ గట్టి
కూర్చి దేహేంద్రియప్రాణ గుణతతులను
మనమె తనసృష్టి ఫలభుక్తి నెనయఁజేసి
'నేను' 'నాయది' యనిపింప నౌను వేమ. 93

తే. జనుని సంసృతి యధ్యాస సంఘటితమ
యట్టి బంధముఁ గొల్పునదా, మనంబె

వెడఁ గవు రజ స్తమో దోష పీడితునకు
జననమరణాది దుఃఖసంజనక మదియె. 94

తే. గాలి మబ్బులమైఁ దిప్పుఁ గాన జగతిఁ
దత్త్వవేత్త, 'లవిద్య'గా దాని నెంత్రు
ముక్తిఁ గోరినఁ దచ్ఛుద్ధి ముం దొనరిచి
విడిచి విషయాళిఁ గర్మముల్, వినుమి శ్రద్ధ. 95

క. తుది మొదలుఁ గలది మాటెడి యది దుఃఖదమౌట దృశ్య మాత్మ యెటు లా
నొదవు, రజస్స్వహాయుతము సదమలచిద్దీప్తితో నెసంగంజను నే?

విజ్ఞానమయకోశము

క. జ్ఞానేంద్రియములు వృత్తులుఁ దానే కర్తగఁ దలంచు తద్బుద్ధియు 'వి
జ్ఞానమయకోశ' మందు రిదే నరుసంసృతికి నిందు హేతువు వేమా!

తే. అది చిదాభాసశక్తినే యనుగమించి
తను హృషీక మనంబులం దెనసి, ప్రకృతి
వికృతు లెఱిఁగి దేహేంద్రియాదికము లేన
యను 'నహంబుద్ధి' పెంపొందఁగ నొనరించు॥ 98

ఉ. జీవుఁడునా 'నహంప్రకృతి' 'జేసి యనాదిగ నెల్లకార్యముల్
పోవని పూర్వవాసనలఁ బొందుచు నయ్యెయి పుణ్యపాపముల్
భావిత సంచితాప్తిని భవంబుల నందుచు నుచ్చనీచముల్
గా విహరించుచుం గను సుఖంబును దుఃఖము జాగ్రదాదులన్.

ఉ. దేన నుపాధి తాననుచు దేహ కులాశ్రమ ధర్మ కర్మ సం
తాన గుణాప్తి బ్రహ్మముగఁ దన్నికటస్థితిఁ దా వెలుంగ 'వి
జ్ఞానమయం' బదిందుఁ బ్రముఖంబయి సంసృతి డిందు నాభ్రమన్
బ్రాణముల స్స్మృది స్థగు పరాత్మ తలంచెడుఁ గర్తృభోక్తృతల్.

మ. అనృతంబయ్యెదె తానుగా బ్రమసి సర్వాత్ముండుఁ గూటస్థుఁడ
య్యును మృద్భాండము మృత్తు వేఱనదుమై నూహించి
తాదాత్మ్య ముం

దినదై వహ్ని యయో వికారముల ప్రాప్తిం దద్గుణాధీనతన్
గనున ట్లుండెడు, బుద్ధ్యుపాధి కృత యోగంబా ననాదిస్థితిన్.101

మ. వియదుత్పాదిత నీలతాభ మెటులొ ప్రాప్తించెం గదా భ్రాంతి ని
ష్క్రియుఁడు న్ద్రష్టయు నిర్గుణుండు విలస చ్చిన్మాత్రమా ప్రత్యగా
త్మ యనాద్యంతవికాసభాసి కది డింద న్బాయ జీవత్వ మెం
తో యసాధ్యంబౌకొ వస్తుభావ మెపుడే నొందం గనన్గామి చేన్.

మ అలసర్పంబు స్ఫురించుఁ ద్రాటను నవిద్యావృద్ధి; విద్యోద్ధృతిన్
గల మేల్కాంచిన మాయ మానటు లెటులంగ' న్బ్రాగభావం' బిదై
నిలువంబో దది యాత్మబ్రహ్మయునొకం డేయన్న సమ్యగ్జ్ఞతన్
జలపంకంబు హరించు నక్కతకపు న్సామ్యంబుగా వేమనా! 103

ఉ. తా నహమాద్యసద్వృతి, ధామమయంబవు సత్తుగాన, 'వి
జ్ఞానమయం' బదిట్లు వ్యభిచారి, జడంబు, వికారి, భిన్నతన్
గా నఁబడంగ, నీదృశగుణంబులు చెల్లునె ప్రత్యగాత్మ, కిం
తేనియు సందియంబు వల, దె ట్టడికాను పరాత్మ, వేమనా!104

ఆనందమయకోశము

శా. ఆనంద ప్రతిబింబ మాత్రము తమోవ్యాప్తం బదా వృత్తియే
'యానం' దాహ్వయ కోశమయ్యె, నరి స్వేష్టార్థప్రియోల్లాసితన్
గానం జేసెడు దేహధారులకు సౌఖ్యం బప్రయత్నంబుగా
నానాపుణ్య ఫలానుభూతులను సంధానించుచు, న్వేమనా! 105

తే. కలను మెలఁకువ నిష్టాప్తిఁ గన నొకింతె
యందఁ బరిపూర్ణ మానంద మా నిదురనె
యిట్టి సోపాధికతను బ్రకృతి వికృతుల
సుకృత ఫలమాట నాత్మ కాదుకద వేమ. 106

కోశాతీతస్థితి.

చ. ఎవఁడు స్వయంప్రకాశుఁడవు నెవ్వఁడు కోశవిలక్షణుండు గా
నవు నిల మూడవస్థలకు సాక్షి యెవండగు నిర్వికారుఁడో

యెవఁడు నిరంజనుండొ ముదమే నిలయంబుగ నెవ్వఁడొప్పు, న
య్యవిహితబోధరూప మిటులైన యభిన్నత గుర్తెఱుంగుమా!

మ. అన, వేముండనుఁ గోశము ల్విడ మహాత్మా! యింక నేముండు నం
చన, యోగీంద్రుఁ డహంప్రభృతులౌ నాయీవికారంబులం
గనవే నీవని, యవ్విలేమి యిటు కల్గ న్నివ గుర్తింపవా?
యనుభూతిం గన సాక్షితాప్తి యవుఁ గాదా, సాక్షి వెట్లౌదనున్.

మ. ఇనబింబంబు ఘటోదకస్థిత మినుం డెట్లౌఁ? జిదాభాసు, భ్రాం
తి, నుపాధిస్థితుఁ దాన యంట యటులే; నీటి న్ఘటి న్నిండఁ దాఁ
గనిపించు న్రవి, యట్ల యాత్మ మెలపం,గాయంబుఁ జిచ్ఛాయ బు
ద్ధిని దీపించెడి ద్రష్ట సర్వగుని గుర్తింప న్స్మృతిం బాయవే? 109

ఉ. బంధము శోకము న్భయముఁ బాయ నెఱింగిన నిన్ను నీవె యా
నందఘనుండ వద్వయ మనంతము సత్యము నిర్మలంబుఁ గా
నందగు దీవ బ్రహ్మముగ, జ్ఞానముఁ బ్రత్యగభిన్నముం బరం
బెందును సంసృతిం బొరయ నిందలి పొందెది యంద కేయెడన్.

## జగన్మిథ్యాత్వ నిరూపణము.

ఉ. మృత్తునసే ఘటాకృతి యమేయముగా నది మృద్విభిన్నమే?
సత్తగు బ్రహ్మకార్యమగు సత్తె, మఱేదన నిద్రమత్తుడే
చిత్తమునం దిదెన్నమినిజేసి జగమ్ము విభిన్నరూపమా
మొత్తముగాఁ గనంబడుట మోహవశంబునఁ గాకదన్యమే? 111

తే. అనుడు వేమన ప్రశ్నించు మునివరేణ్య!
'జగతి బ్రహ్మముమై నిత్య మగునె'? యంచు
దాని కాతఁడు వల్కు 'వేదమున నేమి,
గీత యందేమి లే' దని 'భూతవితతి' 112

తే. జగము సత్యమైన సుషుప్తి నగపడవలె
లేమి స్వప్నముమై నిద్ది లేనిదె సుమి
కావునఁ బరాత్మ కంటె జగమ్ము విడిగ
లేదు, భ్రమఁ దోఁచుఁ గాక గుణాదులట్ల 113

తే. భ్రమ నధిష్ఠాన మారోపిత మదియానె?
శుక్తి రజతంబునట్లు తోఁచునది నిజమె?
భ్రాంతి నెదఁ దోఁపనానెది బ్రహ్మమసుమి
జగతి నేపేర్ల వెలసిన, సత్తదొకటె 114

తే. ఔనె దద్వితీ యాచ్ఛ విజ్ఞానఘనము
నక్రియాద్యంత హీన నిరంజన ప్ర
శమ నిరంతరానంద రసస్వరూప
మప్రమేయ నిరస్త మాయావిభేద 115

నిత్య నామరూప రహిత నిష్కళంబు
నిర్వికల్ప త్రిపుటిశూన్య నిశ్చలంబ
ఖండితాసంగ చిన్మాత్ర కాంతియుతము
నై యనాద్యంత మెటువీడ నందరాక 116

మనసునకు మాటకందని మానదూర
మైన తత్త్వ మ్మటను వ్యవహార మెసఁగ
నవ్యయం బైన దివ్య స్వయంప్రభాఢ్య
మదియ బ్రహ్మంబు పరిపూర్ణ మాత్మ వేమ! 117

చ. ఇనుఁడు మిణుంగు, రాడ్భటు లహీనమహాజలరాశి కూపమున్,
గన నిల, మేరు వేయణువౌ కైవడి భేదము బ్రహ్మ కాత్మకుం
దనరు నుపాధికల్పితము తథ్యమె? యీణ్మహదాదికారణం
బనవు మాయ, జీవునకు నైదవు కోశముల న్సృజించెడిన్. 118

ఆ. పోవ నయ్యుపాధి జీవాత్మఁ బరమాత్మ
భటునిపల్లె ప్రభునిప్రభుత వలెనె
యదియె నీవు కాఁగ నవిలేవు లేవివ్వి। విశ్వ...... 119

ఆ స్థూలముడిగి వ్యోమతుల్యం బతర్క్యంబుఁ।
బూర్ణ బోధ బ్రహ్మమును దెలిసిన
నీవ బ్రహ్మమౌదు జీవత్వ మదెపాయు। విశ్వ...... 120

మ. కల నెట్టట్టులె దేశకాల విషయ జ్ఞాతృత్వాది సర్వంబిటన్
గలిగె న్లేమి, నిజాజ్ఞత న్జగము జాగ్ర ద్దృష్టదేహేంద్రియం
బులు ప్రాణంబు లహంప్రభృతికంబుం దోఁచు నంచెంచి, కే
వల తత్త్వోద్ధృతి, శాంత నిర్మలపర బ్రహ్మంబవే, వేమనా! 121

## మహావాక్యోపదేశాష్టకము.

ఆ. జాతి నీతి కులము చన గోత్ర నామ రూ
పములు గుణ మగుణము ప్రాంగకాల
విషయతతుల మించి వెలయు బ్రహ్మంబవే। విశ్వ...... 122

ఆ. వాగగోచరమ్ము, పరము, విమలబోధ
దృష్టిగమ్యమైనది, యది చిద్ఘ
న, మ్మనాది, శాశ్వతమ్ము, బ్రహ్మంబవే। విశ్వ...... 123

ఆ. ప్రాప్తిఁ గనదు క్షుత్పిపాసాదు లెది, బుద్ధి
కరణ భావితమ్ము గా డదె, యన
వద్యభూతి, యోగి వేద్య బ్రహ్మంబవే। విశ్వ...... 124

ఆ. ఉండి తనకుఁ దాన, యున్నట్టు తోఁచునీ
జగము నెలవయి, సదస ద్విలక్షు
ణ, మకల నిరుపమ, మన మతి, బ్రహ్మంబవే। విశ్వ......125

ఆ. పుట్టనెడుగ మాటిపోఁ జిక్కఁ దోగిగా
గిట్ట నెఱుఁగకే యఖిలము సేయఁ
బెంపఁ ద్రెంప శక్తి వెలయు బ్రహ్మంబవే। విశ్వ...... 126

ఆ. భేదరహిత మిదని పెట్టగు త్రైదికామి
నిస్తరంగ జలధి నిశ్చలం, బ
భక్త నిత్యముక్త పదము బ్రహ్మంబవే! విశ్వ...... 127

ఆ. ఎన్నియైన సత్తె యేకారణము లేక
కార్యకారణములుగాక క్షరము
నక్షరంబు నవ్యయ మవు బ్రహ్మంబవే, విశ్వ... ... 12

ఆ. కొలుపు నామ రూప గుణవిక్రియలు భ్రమన్
గనక మట్టుల నవికారి సత్తు
ప్రత్యగేకరసము పరము బ్రహ్మంబవే విశ్వ ... ... 129

తాదాత్మ్యము

తే. ఇట్లు తత్త్వము గుర్తించి యీ వదియయి
బుద్ధిగుహానున్న దేహమ్ముఁ బొందనేనె?
పోవఁ బ్రాగ్వాసన లకర్తృభోక్తృతలవె
యాత్మ మంద ప్రత్యఙ్నిష్ఠ నందు వేమ. 130

తే. లోకభీతిని దానికే లొంగఁబోక
దేహ మేమవు నన్న వృత్తిని దవులక
విధులఁ దప్ప వెఱచి చేయు నెట్టిఁ గనక
వాస నాధ్యాసములఁ బాప నలయు వేమ ... ... 131

శా. ఏసంపర్కమునల్లఁగల్గినను ఘుర్షింపంగ దుర్గంధము
న్వాసిం జందనమందు చందమున నార్ప న్వాసనాఘాళి ప్ర
జ్ఞాసంఘర్షణ నాత్మనిష్ఠనె మెసంగ న్యోగి ఏవాదువో
యీ! సత్త్వోద్ధృతి నీవుగానియది నీవే యంచు భావింపమిన్. 132

శా. ప్రారబ్ధం బదె దేహపోషకము జీవంబాదునే? బ్రహ్మమన్
జేర న్దేనను స్వప్నమీయదియకా న్నిద్రం గన న్విస్మృతిం
గోర న్లౌకికశబ్దజాతమని దుష్టూకపోత్థితం బిట్టిశా
రీరం బంట కఖండ చిన్మయ కృతార్థీభావ మీ వెంచుమా. 133

మ. ఎది చిత్సత్య మరూప మక్రియ మద్వై యీ 'వీతనూభ్రాంతి వీ
డుదు సూక్ష్మాంగము, దర్పణంపుఁ బురి యట్టుల్గోఁచు నాయంద స
ర్వదిగంతప్రతిబింబితంబు లవు నీబ్రహ్మాండ పిండాండముల్
గద' నా మానముఁదాల్పుమీ ఘటపుటాకాశం బఖండంబుగాన్.

మ. కనునిద్దెల్లను గల్ల యల్లె యహముం గానో ననిత్యం, 'బెఱుం
గనె నేనంటలు సర్వసాక్షిక యగుంగా, నిద్రను న్వెల్గు స

త్తు నసద్వస్తువుఁగాని నిత్యమజ మొందున్బ్రిత్య గాత్మంబవై
కన వీవెట్టివికార మద్దికలుగంగా వానిఁ గాంతెప్పుడున్. 135

ఉ. ఏనని మాంసపిండమున నే, నిదినే ననుబుద్ధి కల్పితుం
గాని తలంప కెయ్యెడ నఖండసుబోధము, వార్ద్రిమా శవం
బౌనిని గోత్రిముం గులము నంకము రూపము నాశ్రమంబు లిం
గానుగతం బెదే న్వికృతిఁ గర్తృత వీడు సుఖంబ నీవెకాఁ 136

'అహం' బంధమూలనిరూపణము.

చ. శమమున మూఢచిత్తతను దానను దేహము, రాహుముక్తుఁడౌ
నమృతకరుండువోలెను స్వయంప్రభమైన నిధి న్సుఖంబు మ
స్తముల గుణాత్మకంబుల భుజంగము గాచెడు, దాని జ్ఞానఖ
డ్గముననె త్రుంప లభ్యమవుఁ గాన నహంబు నడంపు వేమనా!

మ. భవదుఃఖాకరమా నహంకృత వికల్పశ్రేణి మర్దించి, వా
నివిషం బెల్ల నడంచి సాక్షియగు దాని న్నివకాఁ గాంచి తే
ని నికారారినిఁ గంఠకంటకనిభుం జెండాడినట్లైనఁ బు
ట్టువుఁ గాంచు న్మనమింతయే జ్జెదర నెట్టు ల్దాని గిట్టింతువో! 138

ఉ. కారణ మద్రి కాంతుకు వికల్పవిభేద భవోద్భవంబు జం
బీరము వారిచేరికను బెంపవునట్లవుఁ ద్రుంచి యుంచినన్
వారిధరాళి వర్షమున వాయుహతి న్ధర ముంచుకైవడిం
జేరి మనం బహం బమితచింతల పాలొనరించు, వేమనా! 139

చింతాక్రియా వాసనావకర్షణము.

ఆ. విషయ వాంఛ యహ మవియె కార్యకారణా
లౌఁ బరస్ప రాశ్రయములు క్రియలు
వాసనలను ద్రెంపవలెఁ బాయ సంసృతిన్ । విశ్వ...... 140

క. ఇదియది యన కెందెందును వదలక మది కదిసి కార్య కర్తృతఁ
గొల్పన్

జెదరక ముదర న్వాసన సదమలమా బ్రిహ్మనిష్ఠ సకల మడంచున్.

మ. క్రియ మాన న్విషయైకచింత యడఁగం గ్రిందయ్యెడు న్వాసనల్
భయదాంధం బరుణప్రిభా ప్రిసృతిమై బ్రహ్మైకనిష్ఠా ప్తిచే
వ్యయమైపో నహమాది వాసనలు జీవన్ముక్తి యింద్రప్పుడెం
తయు నానందరుచిం గొన న్నమయు బాధంబెల్ల దుఃఖంబిలన్. 142

బ్రిహ్మనిష్ఠావశ్యకత

ఉ. ముం దెడియున్న నాదెసకె పోవఁగనీయక యెందు దృష్టి నా
నందఘనమ్ము నిశ్చల మనంతము తానవు నానిరూఢితో
డం దగ కింతయేమఱ నెట న్మృతియా నదె మోహ ముద్భవం
బంద నహమ్ము బంధము రయమ్మునఁ గుదును డిందఁజేయఁగాన్.

ఆ బుధ్ముఁడ యేని విషయములఁజేర విస్మృతి
ముదిత ముదిరునట్లు బుద్ధిఁ దిగిచి
మాయ గప్పివైచుమై మరు ల్గొల్పెడు, విశ్వ ... ... 144

ఆ. చెదర గుఱి నొకింత చిత్తంబు మెట్లను
దొరలు బంతి వలెనె తుంగ్రిగుఁ గాని
యెగయదాటఁ దలఁపు నెనయుఁగఁ దగదెందు విశ్వ .. ... 145

క. ఉడిగి యస త్తత్స్థిరమని కడఁ ద్రోయుచు బ్రిహ్మనిష్ఠఁ గడలుకొని
యెటే
నెడఁద న్మగుడం దడఁబడఁ బడఁగొట్టుచుఁ దాని కొమ్మపై
కెక్కు టదాన్ ... 146

తే. ముక్తి సున్న దేహాదిక సక్తిఁ గన్న
ముక్తిఁ గన్న దేహాదిక సక్తి సున్న
కలనె యున్న మెలంకువ గలుగ దెన్న
మెలఁకువం గల యేనాఁడుఁ గలుగదన్న! 147

ఆ. అలర లోను బైట నాధారమై చరా
చరములఁ దనను గని సర్వగుండ
ఖండుఁడై యుపాధి కాకుండు ముక్తుండు విశ్వ ... ... 148

చ. ఎడఁద నిదెల్లఁ దానె యని యెంచుచు భిన్నమె దెన్నకున్న నే
యుడుపఁగఁజాలు బంధ మెదియు న్మతిమార్గము కానరా దిటుల్
విడువక చింతసేయ నగు వీక్షితమెల్ల నుపేక్షితం బిఁకం
దడయక యాత్మనిష్ఠఁ బరతత్త్వ మెఱింగి మెలంగు వేమనా! 149
చ. అనుభవమబ్బ యోగికి సమాధియె తక్క మఱొక్క మార్గముం
గన మఱె వేద చోదితము;గా దడఁపంగ నహమ్ము దేన, వా
సనలు భవాగతంబులు వాసంగు నహమ్ము మోహ మావృతిం
గొనఁ గదలించుఁ దద్గుణముఁ గూర్చి యహమ్మున డింద వేమనా!

నిర్వికల్ప సమాధి

తే. ఆవృతి ననమి విక్షేప మడఁగ దంచ
క్షీరనీరములట్లు దృగ్దృశ్యములుగ
సేయ నదివో మృషార్థ వాంఛితము లెడల
మోహబాధము తెగ మాయ ముక్తి నిగను. 151
తే. ఆత్మ పరమాత్మయు నభేద మరునవలము
కాల్ప స్వజ్ఞాన వనమెల్లఁ గమలిపోవె?
యావృతియును మిథ్యాజ్ఞాన మంతరించి
సకల విక్షేప దుఃఖము ల్సమసిపోవె? 152

మ. వరుస న్భ్రాంతిద గజ్జుహావ మెఱుఁగ న్వ్యక్తం బివై యబ్బవోఁ
బరతత్త్వ స్థిరదృష్టి యూనిగణ సుహృత్పన్న హ్నాతో నిరున్మమై
స్వరసత్త్వస్థితి నిద్రియాదిసరణి న్వ్యస్తంబుగా బుద్ధి స
త్వర మీమూఢు భ్రమా ప్తినో కలఁ దలంపన్గల్గు మేఁగల్లయాఁ.
సీ. ప్రకృతివికృతు లహంభావ ప్రభృతి తత్త్వ
దేహాంత విషయము లీలుపడఁగ
నెనలేని తిరమైన యేకచిదూపంబు
నక్షీణ సదస ద్విలక్షణంబు
బుద్ధ్యాదిసాక్షిగాఁ బొదలి 'నే' ననుదాన
జ్ఞేయమై తనకుఁ దానే యలరెడు

ననుపమ ప్రత్యక్సదానంద ఘనమద్ది
యద్దానినే పరమాత్మ యనుచుఁ.
తే. గనుచు సదసద్వివేచనంబున నెవండు
తత్త్వ నిశ్చయ నిజబోధఁ దన నఖండ
బోధమే కాఁగ గుర్తించుచో ధరిత్రి
నెల్ల విశ్రుతులు వో శాంతి నెనయు వేమ. 154
తే. ఒకట నిర్వికల్పసమాధి నుడుగు వేళ
నెవ్వఁ డాత్మసాక్షాత్కృతి నెనయు నపుడ
వాని యజ్ఞాన హృద్గ్రంథి తోనెవీడి
మతి వికల్పము లడఁగ బ్రహ్మము స్ఫురించు. 155
చ. ఎపు డెటశాంతిదాంతిఁ గొని 'యేను' 'నీ' 'విది' వో, సమాధిలో
నుపరతియుం దితిక్ష తగుయోగి సమస్తము తానయై యవి
ద్య యెనుచు నేవికారములనైన దహించుచు నిష్క్రియుండయై
యపగతభేదభావమున నాఱ నుపాధి, సుఖించు బ్రహ్మమై! 156
క. ఏవిధమునఁ గీటక మిల భావించుట భ్రమరమదియె భ్రమరంబౌనై
నీ వెయ్యెడ 'సత్' చింతన గావించిన నౌదు 'స' త్తెకద వేమన్నా!
మ. పుటపాకంబున శోధితంబయి మలంబు వాయు స్వర్ణంబుమైన్
ఘటితానంతసమాధినిష్ఠఁ ద్రిగుణగ్రంథి ప్రభిన్నస్థితిన్
బటుతత్త్వం బతిసూక్ష్మస్మృతి నెనయు స్పష్టంబుగా మానసం
బెటనే ద్దానయి యుంట గోచరముగా నేవాసనల్ వాసెడిఁ ॥158
చ. శ్రవణముకంటెమే ల్మననసంయుతి, ధ్యానము దానిమించ, నె
చ్చవుసుమి నిర్వికల్పక మనంత మెఱుంగఁగ బ్రహ్మతత్త్వమున్
దవిలిన నద్ది మానసముచం జలనంబు నడంచి, యింద్రియ
వ్యవహృతి మాన్పి సత్తున ననాది తమంబవు మాయనొంచెడున్.

## తత్సాధన క్రమము

ఉ. మానము, దేనినిం గొనమి, మానుట నాస, నిరీహ, యొంటిదౌ
స్థానము, నింద్రియోపరతిఁ దార్పఁ దమంబునఁ జిత్తనిగ్రహం

బాను శమం బహంకృతి రయంబునఁ బాపఁగ బ్రహ్మమోదమా
గాన సతంబుఁ జిత్తమును గట్టుట సిద్ధికి సాధనంబగున్. 160

ఆ. వాకు నాత్మ, నాత్మ చేకొన బుద్ధిని
బుద్ధి బుద్ధి సాక్షిఁ, బొదల సాక్షి
నిర్వికల్ప పూర్ణ నిచితంబుగా శాంతి । విశ్వ... ... 161

క. తనువునఁ బ్రాణేంద్రియముల మనమున బుద్ధ్యాద్యుపాధి
మయమగు వృత్తిం
గన ముని తానదెకా నెవి యెనయమి నానందరసమె యెదనొద
వదకో॥

చ. వెలి, విషయాదిసంగమును వీడఁగ లోని యహంక్రియాదికం
బుల నవు బ్రహ్మనిష్ఠునికె, ముక్తివటారున నెక్కఁ బక్కెఱ
క్కలుగ విరాగ మొక్కటియు జ్ఞాన మిఁకొండు సమాధిబోధలన్
వెలయ, భవంబువాయ, వినువీధిఁ జరింతు సుఖానుభూతితోన్.

చ. విరతి మునీశ్వరప్రదము పెంపఁబ్రబోధము బ్రహ్మరాజ్య సుం
దరమవు, ముక్తికాంత కనెడారి, విడ స్మృతి దేంద్రియార్థముల్
తఱిగిన జాతినీతి కులధర్మయుతాశ్రమకర్మముల్, జడా
దరణ మడంగి బ్రహ్మమునఁ దార్కొను సాక్షిత, నద్వయాత్మతన్

మ. మనము బ్రహ్మమునందు నిల్పి స్థిరతం బ్రాపింప బాహ్యేంద్రియా
ల్లనువు, న్దేహ మిదేమి యానో యనుచింతం బోక, బ్రహ్మంబ వీ
వను తాదాత్మ్యము నంది వేర్పడని భావంబొప్ప నానందమే
తనియుంజేయు రసానుభూతిగను జెంద న్గాదె శూన్యం బెదేన్.

మ. అరయం గర్మల దుఃఖమూలము ననాత్మాయత్తముం జిత్తమున్
మరల న్సాక్షిగ స్వప్రకాశతను మించంజాలు విజ్ఞాన కో
శ రమ త్పూర్ణసుఖ స్వరూపుని దెసన్ సారించుచు న్దృష్టి యే
మఱి కీవాతఁడె కా నెఱింగి కను వేమా! దేహమున్నిస్పృహన్॥

## సర్వాత్మభావ ప్రబోధము

మ. ఘటముఖ్యమ్ము లుపాధు లజ్ఞతవి యేగ ద్దేహ మీాయింద్రియా
లటులే ప్రాణ మనోహమాదు లడఁగ న్వ్యావృత్త నానాత్వమై
యెటనే న్నీవయి, పాము త్రాటిగతి నాయీాభ్రాంతివో బ్రహ్మమె
క్కటి విశ్వంబుగ లోన బైటను జిదాకాశంబుగాఁ గాంచుమాా.

మ. అలలే న్నురుగులు సుళ్లు బుగ్గలు జలం బౌదేహ మట్లీయహం
బలము న్నిర్మల చిద్విలోలత, నవిద్యేరేయ మత్తోక్తిఁ బా
టిలుభేదంబు లడంగ నచ్ఛమవు మింటి న్నిర్వికారస్థితిన్
మెలప న్నించినరీతి జీవు నెట బ్రహ్మీభూతతం గాంచుమాా.168

ఉ. ఈమలకోశ మేననకుమీా యనిలాభము లింగదేహమే
నామెయి నెంచ, మైలగ 'శవాకృతి' జన్మజరాదిదుఃఖదం
బౌ, మఱి పూతమైనది 'శివాకృతి'ఁ దాఁ దగు చిత్తవృత్తి మి
థ్యామతిఁ బ్రామ, నిల్పెదు స్వయం పరిపూర్ణ సుఖస్వరూపమై

మ. అనయం బిట్లయి యేవికల్పములఁ బాయన్నీవయాా నిర్వికా
ర నిరాకారపు నిర్విశేషము పరబ్రహ్మంబె కా, ద్రష్టృద
ర్శన దృశ్యాదిక ధర్మశూన్య పరిపూర్ణం బేకమాా వస్తువై
న నిఁక న్భేద మదెందు నెట్టులవు నెన్న స్వల్ప మేదేటికిన్॥ 170

చ. తలచిన నెట్లు సప్పమును ద్రాట, మరీచిక నీటిబొట్లు నె
వ్వరుఁ గన రట్లె నిత్యమవు బ్రహ్మమునందు జగమ్మె లేదు,భ్రాం
తిరహితమాఁ బరాత్మనె స్థితింగనఁ జిత్తము నిర్వికల్ప మం
బరనిభ నిష్కళం బజము భవ్యనిరీహ సుఖస్వరూపమాన్. 171

చ. శమితగుణత్రయోల్బణము శాశ్వతశాంత సుఖస్వరూపముఁ
స్తిమితసముద్రమాా నిరవధి ద్దగు నేక మఖండమై భవం
బమరము నిత్యముక్త సతతాద్వయబోధ మతీంద్రియం బనా
ఖ్యము నజరం బజస్రము సమాధిని గాంచుచునుండు మెయ్యెడన్॥

మ. పరసౌఖ్యంబున లీనమైన యెడలన్ బ్రారబ్ధసూత్రోత్థితం
బరయ న్మెమ్మె, మెడ దండగోవునకుమై, నంతర్బహిర్నిత్యచి

బౌను శమం బహంకృతి రయంబునఁ బాపఁగ బ్రహ్మమోదమా
గాన సతంబుఁ జిత్తమును గట్టుటె సిద్ధికి సాధనంబగున్. 160

ఆ. వాకు నాత్మ, నాత్మ చేకొన బుద్ధిని
బుద్ధి బుద్ధి సాక్షిఁ, బొదల సాక్షి
నిర్వికల్ప పూర్ణ నిచితంబుగా శాంతి। విశ్వ...... 161

క. తనువునఁ బ్రాణేంద్రియముల మనమున బుద్ధ్యా ద్యుపాధి
మయమహా వృత్తిం
గన ముని తానదెకా నెని యెనయమి నానందరసమె యెదనోద
వదకో॥

చ. వెలి, విషయాదిసంగమును వీడఁగ లోని యహంక్రియాదికం
బుల నవు బ్రహ్మనిష్ఠునికె, ముక్తినటారున నెకటఁ బకిటతె
కటలుగ విరాగ మొకటటియు జ్ఞాన మిఁకొండు సమాధిబోధలన్
వెలయ, భవంబువాయ, వినువీధిఁ జరింతు సుఖానుభూతితోఁ.

చ. విరతి మునీంద్రపదము పెంపఁబ్రబోధము బ్రహ్మరాజ్య సుం
దరమవు, ముక్తికాంత కవెదారి, విడ స్మృతి దేంద్రియార్థముల్
తఱిగిన జాతినీతి కులధర్మయుతాశ్రమకర్మముల్, జడా
దరణ మడంగి బ్రహ్మమునఁ డారొటను సాక్షిత, నద్వయాత్మతన్

మ. మనము బ్రహ్మమునందు నిల్పి స్థిరతం బ్రాపింప బాహ్యేంద్రియా
ళ్ల నువు, న్దేహ మిదేమి యానో యనుచింతం బోక, బ్రహ్మంబ వీ
వను తాదాత్మ్యము నంది వేర్పడని భావంబొప్ప నానందమే
తనియంజేయు రసానుభూతిగను జెంద న్గాదె శూన్యం బెదేన్.

మ. అరయం గర్మల దుఃఖమూలము ననాత్మాయత్తముం జిత్తమున్
మరల న్సాక్షిగ స్వప్రకాశతను మించంజాలు విజ్ఞాన కో
శ రమ త్పూర్ణసుఖ స్వరూపుని దెసన్ సారించుచు న్దృష్టి యే
మఱి కీవాతఁడె కా నెఱింగి కను వేమా! దేహమున్నిస్పృహన్॥

## సర్వాత్మభావ ప్రబోధము

మ. ఘటముఖ్యమ్ము లుపాధు లజ్ఞతవి యేగ ద్దేహ మీయింద్రియా
లటులే ప్రాణ మనోహమాదు లడఁగ న్వ్యావృత్త నానాత్వమై
యెటనే న్నీవయి, పాము త్రాఁడగతి నాయాభ్రాంతివో బ్రహ్మమె
క్కటి విశ్వంబుగ లోన బైటను జిదాకాశంబుగాఁ గాంచుమా.

మ. అలలే న్నురుగులు సుళ్లు బుగ్గలు జలం బౌదేహ మట్లేయహం
బలము న్నిర్మల చిద్విలోలత, నవిద్యేరేయ మత్రోక్తిఁ బా
టిలు భేదంబు లడంగ నచ్ఛమవు మింటి న్నిర్వికారస్థితిన్
మెలప న్నించినరీతి జీవు నెట బ్రహ్మీభూతతం గాంచుమా. 168

ఉ. ఈమలకోశ మేననకుమీ యనిలాభము లింగదేహమే
నామెయి నెంచ, మైలగ 'శవాకృతి' జన్మజరాదిదుఃఖదం
బౌ, మఱి పూతమైనది 'శివాకృతి'ఁ దాఁ దగు చిత్తవృత్తి మి
థ్యామతిఁ బ్రాము, నిల్చెడు స్వయం పరిపూర్ణ సుఖస్వరూపమై

మ. అనయం బిట్లయి యేవికల్పములఁ బాయన్నీవయా నిర్వికా
ర నిరాకారపు నిర్విశేషము పరబ్రహ్మంబె కా, ద్రష్టృద
ర్శన దృశ్యాదిక ధర్మశూన్య పరిపూర్ణం బేకమౌ వస్తువై
న నిఁక న్భేద మదెందు నెట్టులవు నెన్న న్జల్ప మేదేటికిన్॥ 170

చ. తలచిన నెట్టు సప్పమును ద్రాట, మరీచిక నీటిబొట్టు నె
వ్వరుఁ గన రట్టె నిత్యమవు బ్రహ్మమునందు జగమ్మె లేదు, భ్రాం
తిరహితమౌఁ బరాత్మనె స్థితింగనఁ జిత్తము నిర్వికల్ప మం
బరనిభ నిష్కళం బజము భవ్యనిరీహ సుఖస్వరూపమౌన్. 171

చ. శమితగుణత్రయోల్బణము శాశ్వతశాంత సుఖస్వరూపము
స్థిమితసముద్రమౌ నిరవధి ద్దగు నేక మఖండవైభవం
బమరము నిత్యముక్త సతతాద్వయబోధ మతీంద్రియం బనా
ఖ్యము నజరం బజస్రము సమాధిని గాంచుచునుండు మెయ్యెడన్॥

మ. పరసౌఖ్యంబున లీనమైన యెడలన్ బ్రారబ్ధసూత్రోత్థితం
బరయ న్నైన్మె, మెడ దండగోవునకుమై, నంతర్బహిర్నిత్యాచి

ద్భరి తానంద రసానుభూతిఁ గను జీవన్ముక్తత న్వేమయో
గి! రహింపంగనుమింక, బ్రహ్మమహితాగ్ని న్గాల్చియీదేహముల్

వై రా గ్య బో ధో ప ర తు లు

శా. వైరాగ్యమ్మునబోధ మయ్యుపరతి న్నానందమై శాంతియా
నీరీతిం గనకున్న వ్యర్థములు కావే పూర్వముల్, బంధమో
క్షారంభంబును దృష్టి సౌఖ్య మెదఁబాయ న్బ్రాప్తదుఃఖాళి, వి
ద్యార్థికార్జన నేమరీచికల కిం కాసింతె? రిక్తాజ్ఞమైన్॥ 174

చ. ఎద ముడివీడ నజ్ఞతెడి యిచ్చలెపాయఁ బ్రవృత్తి కీడ్చునే?
యుదయము భోగ్యవాసనల నొందమి మేర విరాగికెం దహం
త దగమి జ్ఞానగమ్యముగదా లయమై పునరుద్గతంబు గా
నిది యుపరత్యవస్థితి, కనె న్గలనాఁ గన నీ ప్రపంచమున్. 175

మ. మన మాత్మ న్లయమంద నిష్క్రియత బ్రహ్మైక్యైకభావంబు నీ
వెనయం బ్రజ్ఞ తిరంబుగా హతవికల్పేహా వికారస్థితిన్
గనువిశ్వంబున వాసనం గనక జాగ్రద్దగ్మమే లేక, శాం
తిని నిశ్చింత మనుత్వమందమినిబ్రాప్తిం దృష్టి వ్యాప్తం బవున్.

మ. గతపుంజింత యనాగత వ్యసనముం గాంచం డుదాసీనమా
స్థితి బంధమ్ముల డిందకెందు సమదర్శిత్వమ్మునే పొందు, దు
ష్టతిరస్కారము శిష్టభూషణము పట్టన్, వార్ధి నానాధునీ
ప్రతతు ల్సొచ్చినమైఁ బరేరిపము లర్థమ్ము ల్లయం బందఁగాన్.

శా. ఏనాఁడే నెట బ్రహ్మతత్త్వవిదుఁ డయ్యెంబో మెవం డైనఁ బూ
ర్ణానందైక రసానుభూతిఁ గని యన్యం బింక మూచూచునే?
తా నేకాముకుఁడైనఁ దల్లిదెస డిందంగన్నమై వాసనా
ధీనత్వంబును గాంచఁ డెయ్యెడ ననర్థీభూతత న్మ్రిందఁగాన్. 178

శా. ప్రారబ్ధంబు ఫలాప్తిహేతు వెది ద్వంద్వాతీతమా నంతకే
యేరీతి న్గల నేమిసల్పిన దివంబే న్నారకం బబ్బదా
తీరై సంచితమార, నాకసముభాతిం గోర కేదంటమిం
డా రేమోగు లెఱుంగ వార లిఁక నందంబోవ తాగామినేన్.

మ. కలు దుర్గంధము నంద దెట్టుల ఘటాకాశం బుపాధిస్థితి
న్గలుగంబో దటె వానిధర్మముల కెక్కన్బ్రహ్మమం చెంచఁగాఁ
బులిగా నెక్కిడి పీడఁ బాడిమొదవ న్బుద్ధి న్గన న్వేనకని
ట్టుల నిర్జింపమి? తెల్వికల్మి మునుపట్టు ల్భాగ్య మారబ్ధమౌన్.

మ. కలలోవార్తల నూఁకొనంజనునె జాగ్రద్ధర్మముంబొంది? యే
రిలలో ము న్గలఁగన్నదెల్ల మృషగానే యెంచరే? కామిసు
పుత్రులె కారే?యటె బ్రహ్మనిష్ఠులకుఁ గుడ్పున్విడ్పు స్వప్నంబె, వా
రలదేహాలకె కర్మనిర్మితిని బ్రారబ్ధంబు, గా దాత్మకున్. 181

మ. అదియు న్భ్రాంతియకాక, యునికి యెటు దేహంబందు? జన్మంబె కూ
రదు నాశంబటె లేనిదాని కెటఁ బ్రారబ్ధంబు నాఁజెల్లునే?
యెద నస్తిత్వము నెంచు నజ్ఞు లిటుప్రశ్నింప న్సమాధానమా
నిది యజ్ఞాన వికల్పమింతయును గాదే జ్ఞానదగ్ధంబిలన్॥ 182

ధృవ. అనుచుఁ బల్కి యనంత మవ్యయ మప్రమేయ మవిక్రయం
బనుపమాన నిరస్తరాగ నిరంజ నాద్వయ నిర్గుణం
బనితరాశ్రయ నిత్యపూర్ణ నిరస్త భోగ నిరామయం
బని సమాధి నెఱింగి సర్వము నందు నైక్యమె ముక్తినాన్॥ 183

చ. కనుగవ చెమ్మగిల్ల వడగల్లు మహోదధి నీరమైనమై
మనము కరంగిపోవఁ గనుమాటయినట్టు జగంబె కాఁగ, వా
కొన నెదియూఁకొన న్నిలుపఁ గూడని జాడ నఖండసౌఖ్యలే
హ్యా నిబిడ నీరధి న్మునిఁగి నట్లయి హానికి సాఁగిలంబడెన్. 184

శ్రీ గురు ప్రసాదము

ఉ. లేదెట దేహభానము చలింపక కట్టెగ నట్టెయుండె, మా
యా దమనాత్త నిష్క్రియత నగ్గురువర్యులు గుర్తెఱింగి, జ్ఞా
నోదయ మైనయందులకు నుతితత్త్వము సుస్థిరత్వ సం
పాదనమంది లోకమున వ్యాప్తముగా నిటు దీవనం బిడెన్. 185

చ. ఘన నయ వాఃకణమ్ములు జగమ్మున శుక్తినిపాతితమ్ములై
మనముల కింపులీను నవమౌక్తికజాలపు టక్షరత్వముం
గన జనము ల్గ్రహింపనవు కైవడి వేమన వాక్ప్రచారముల్
సన నిలఁ దేటమాటలను శాశ్వతమై విలసిల్లుఁ గావుతన్. 186

ఆ. ఆటవెలఁది వలనన్నై నందులకు నిట్టులాటవెలఁదిఁబలుకు తేటమాట
లూట లూర మాటిమాటికి నీనోటవాటమైనసూటిబాటఁగనుత.

మ. అనిదీవించి మహాద్యుతి న్నిమిరి మాయంబయ్యె నేరికన్వైమై
వినుగీర్థి న్వివహరింపనో ! మఱియు నేవేమన్నఁ దా నుద్ధరిం
పనో ! దీపం బొరుదీపముంగొలిపి పెంపంగాంతి యోగ్యం దమం
బు, నిఁకిం కెయ్యెడ వెల్లనో ! యనఁగఁ బోవు న్యోగి చిద్దీప్తితోన్॥

ఆశ్వాసాంతము.

శా. ధాత్రోపేంద్ర మహేంద్రముఖ్య నుత మేధాదక్షిణామూర్తిదే
వ త్రైకాలిక చింతనాత్త విలస ద్వైదుష్య సంభావనీ
య త్రైవర్గిక వర్తనాచరణ సమ్యగ్జ్ఞేయ నామాంకిత
ద్వాత్రింశ ద్యవనీయనాటకముఖ త్రైవిద్య బోధోల్బణా. 189

మాలిని: శ్రుతివిహిత విచారా ! సూరివర్ణ్య ప్రచారా !
శ్రిత బహుపరివారా ! శిక్షిత చ్ఛాత్రవారా !
కృతిమథిత వికారా ! కేలి తానోర్ప్యపకారా !
ప్రతికృత పరసారా ! వ్యాప్త కీర్తిప్రసారా ! 190

గద్యము

ఇది శ్రీ మేధా దక్షిణామూర్తీశ్వ రాక్షీణ కరుణాకటాక్ష వీక్షాపాత్ర
నాదెళ్ల పురుషోత్తమ కవీంద్రపుత్త్ర మేధా దక్షిణామూర్తిశాస్త్రి
నామధేయ విద్వద్విధేయ కర్తృక శ్రీ వేమయోగీయంబునందుఁ
ద్వితీయాశ్వాసము.

# శ్రీ వేమయోగీయము.

## చతుర్థాశ్వాసము

క. శ్రీవేమ వాక్ప్రచార ప్రావృట్సారప్రసేక రచితాధారా !
జీవన్ముక్తోదార ప్రావీణ్య జ్ఞానసార ఫల విస్తారా ! 1

వ. లబ్ధగురుప్రసాదుండైన యవ్వేమయోగివరుం డాపై నేతెరు వందెనన్న నిదె యవధరింపుండీ. 2

### సూర్యోదయము

చ. అలరులతావిఁగొంచు మలయానిల మెల్లెడఁ జల్లనై తగఁ
గలకలలాడసా శుకపికప్రముఖాండజ నిస్వనంబు లిం
పొలయఁ దెలుంగుదేశపు మహోదయ మయ్యెడుచల్లులల్లఁగా
వెలయ ననూరునశ్వములు వేకువఁ దేఁకువమీఱ సాఁగఁగాన్. 3

ఉ. పోదము పోదమంచుఁ దమపున్గము లొండొకటి న్ప్రియంబున
న్మీఁదికి మీఁదికెక్కొ తఱిమె న్నిసియాదెసఁ బట్టిపోవ భా
నూదయమై మనోజ్ఞ సుమనోమయత న్సరసుల్గ జ్ఞానభా
నూదయమై మనోజ్ఞసుమనోమయత న్సరసుల్గనంగనన్॥ 4

ఉ. ఏమఱి పామరత్వముననే మెలఁగం దగదంచు నెల్ల ని
ద్రామయలోకముం దెలివిఁదార్చుమయూఖచయంబునట్లనా
నామహితాచ్ఛబోధముఁ గన న్మమయుం బపుడయ్యెనో యన
న్వేమన నోటిమాటలు కవిత్వ మదై తగ నయ్యెఁ బాదముల్.5

### వేమన జీవన్ముక్త స్థితి.

చ. ఎచుట నెవండమైనఁ గలఁడేయని యెన్నఁడు నోటి కెప్పుడే
య్యాది యనఁ దోఁచు నద్దియను, నట్లదిపద్యము దానఁబూర్తియై
నదో యరయంశు, భావము మనంబునఁ గల్గిన వాక్స్వరూపమై
పోదలెడునంతవట్టె యది పూర్తికిఁజూడఁడు కీర్తి కట్టె కాన్॥ 6

చ. ఎపు డెదిపల్కునో యెఱుఁగ డెయ్యది ధారణ నిల్పఁబోవఁడే
యపుడవ్వఁగాక యాత్మ తెలియంగల లేఖకపాఠకోత్తమా
భ్యుపగమ మబ్బదయ్యె ననియు న్మది నెంచఁ డెవండొ యున్నమై
వ్యపగతబాహ్యదృష్టియయి వాకొను నూఁకొన నేరు లేమి నేన్.

ఉ. త్రోవ యొకండు ద్రొక్కఁ డెదితోఁచిన నాను బహిర్గతంబు, వి
ద్యావిభవంబు నందమిని వ్యాకృతి నేరమిఁ దేటతెల్గులం
దే వచియించు గ్రామ్యగతియే యయి పామరలోకగమ్యమై
తా వెలయ న్నను స్తజనతా హృదయంగమ సామ్యయుక్తితోన్॥

ఆ. సిద్ధవాక్కయత్నశీఘ్రవాక్సిద్ధినిగూర్పఁబదముఁదడవికొనఁ జనండె
మాటనడుమ యతిని మాటువెట్టంబోవఁ డమృతఘుటికలట్టు
లవె సరిపడు॥ 9

ఆ. ఆట వెలఁదిపాద మందె సంధిలనొచు నెట్టిభావమైన నిమిడిపోవు
మంచిచెడుగులరయఁగంచుకాగడ వేసివెదక వ్యర్థమైనపద మొకనము.

ఆ. భావ మిమిడిపోవఁ బాదద్వయంబున
మాటసామ్యమెదియొ ముడిపడంగ
'విశ్వదాభిరామవినుర వేమా' యంచుఁ
దుదకు మకుట మొందు నమరుచుండు॥ 11

ఆ. సృష్టి మొదలుగాఁగ స్థితిలయంబులదనుకఁ
బుడమిఁ గల్గు సర్వభూతచయపు వేషభాషలాది వేదాంతసారాంత
మిదియు నదియు నేల? యెల్లఁబలుకు. 12

ఆ. కాని మకురుపోలె దేనినైన స్ఫురింప
వేషగాండ్రఁదిట్టి వేయు నెందుహాస్యరసముమీఱనవిపడ్డవారైనఁ
దక్కువారియట్ల తారు నవ్వ॥ 13

ఆ. వీను సోఁకినంత లోనె నాటుకొనంగఁ
దగినయట్టి నవ్యతను మెఱయఁగ సహజభావయుక్తిసరిపడ లోకోక్తి
యువు నిసర్గగరిమ మందఁ బలుకు. 14

ఆ. ప్రకృతి మురియుకంటె భౌతికవిముఖత
కలుగఁ బారలౌకికమగుదృష్టిఁ దానుదెగడునెల్ల దాక్షిణ్యమేలేక
యాత్మబుద్ధిఁ బ్రత్యయంబు కలిమి॥ 15

ఆ. పతితకావ్యుఁడైనఁ బ్రాఁత వేమా స్ఫురించు
నట్లుగామిఁ గ్రొత్త వవియె తోఁప, ననుభవజ్ఞు లెఱుఁగునవె
యుపమానముల్ । కాఁగ నూటలూరుగతి వెలువడ. 16

వ. ఇవ్విధంబున నవ్వేమయోగీంద్రుం డెవ్వివ్వియో కొలఁదిద
వ్వేగాలికోపోవఁ దా వాకొనుచు నున్నెడ. 17

అభిరామయ్య వచ్చి గుర్తించి కొంపోవుట.

మ. మును పేపర్వమునందుమైనె యభిరాముం డొంట యోగీశ ద
ర్శనబుద్ధిన్ ఫలపుష్పముల్గొనుచుఁ జేర న్వేమసంబుద్ధితోఁ
నను నేయు క్తులోపీనులంబడఁగ 'నేమా?' యంచు నిష్కాహామం
దు నిడ న్బాదము, మున్నుగన్నమును లెందున్నేను, 'ఫీ రేరో' నాన్॥

చ. పెరిఁగినగడ్డము న్జడలు పెల్లుగ నల్లుకొనంగఁ జైత్యగ
హ్వారమునఁ దేనెతుట్టె యిరెపట్టెనో నాఁగఁ బతంగికారవం
బినవుకొనంగ నైనగతి నేమొకో నాదము వెల్వడంగ ద
గ్గఱిన కొలంది నింపులొలుకన్ వినుమాటలె తేనెయూటగాఁ.19

ఉ. ఆముని కామరూపుఁ డవునా? యిపు డివ్విధి నుద్ధరింప, గా
రామునఁ బేరఁ బిల్చి 'యభిరాము'యటంచనఁ గాదు, విశ్వదా
ఖ్యా మనురాభిరామతను గల్గినవేమన యాత్మబోధమూ
నేమొకొ పోల్చిచూడ నతఁడే యిటులైనటు కానవచ్చెడున్॥ 20

ఆ. 'ఎంతకాలమాయె నేమాయెనో!' యంచుఁ
జింతసేయనేఁటి కంతుదిక్కె । నంత భోగశీలుఁ డింతయోగి
యెటాయె! వింతగదవె పలుకరింత మనుచు॥ 21

క. దరికేగి యెటులఁ బిలిచినఁ । బరిచితి గలయట్టు లెన్నిపలికినఁ జెవిలోఁ
జొరకుండనె తనధోరణిఁ । బరమానందంబుమీఱ వాకొనునదిమో॥

ఆ. తల్లి వదినె యన్న తనప్రియురాలును నేమిమైరొ
యరయ నేయరయఁడౌ ఊరుఁబేరు నెన్ని యో గుర్తులను జెప్ప
శంఖ మూఁదఁ జెవిటి చందమాయె॥ 23

క. మెలఁకువ నున్నను జాగ్రత్కలనమె కానంగరాదు, కలదా బాహ్యాం
బుల స్మృతి యేమాత్రమయినఁ గలయిదిగా నతనిమదికిఁ గను పట్టెడినో॥ 24

క. గతచింత రవంత యనాగతచింతయు నుంత కానఁగారా, 'దే,న్నా
దితరం'బనితలపోయం డతనికి వేర్వేఱుగా, నెదగపడదేమో ! 25

క. ఆఁకలిడప్పులె లే వేమొ! కావలెననఁ, డైదైన నుంచిన నోట
న్మేకొను దయకల్మినిమై నా కిది రుచియించుఁ గాదునాఁ జనఁ
డెందేన్॥ 26

క. కయినట్టి లేవఁదీయుచుఁ బయనం బెటుసేయ నటులె పదముల నిడుదున్
భయభక్తుల నడిపించుచు రయమున నిజపురముదెసకు రాన్నై నంతన్॥ 27

సీ. అగపడ్డవారెల్ల రెగదిగఁజూడంగఁ
బెరుబూచియని యేరొ బెదరఁదోడఁగఁ
గొంద ఱెచ్చటినుండి కొనివచ్చి టనుకోఁగ
బుద్ధి నెవ్వరొ వేముఁ బోల్చికోఁగఁ
గొందఱు లెంపలఁ గొట్టుకొంచు న్మ్రొక్క
దొంగ వీఁడని పెర ల్ద్రోలఁగిపోవఁ
గొందఱు జ్ఞానియంచుం ద త్త్వ మరయంగ
వెఱ్ఱివాఁడని పెర ల్వ్రేల నేదొ॥

తే. తాను వనమందుఁ బురమందు నైన నొకటె
రీతి బ్రాఁతిగ నీతు లదే తెఱఁగున

నిచ్చవచ్చినట్టైఁ బల్కఁజొచ్చి శాంతి
దాంతి మెఱయంగ సమదర్శిత న్మెలఁగుచు.

ఆ. ఉండఁ గాశికేగి యుండిన తన్మాత
యాత్రపడుచువచ్చియశ్రులురలనొడలునిమిరియల్ల కడగొట్టుబిడ్డనిఁ
గంటి విశ్వనాథు కరుణ నంచు. 29

ఆ. కౌఁగిలించికొనియు గడ్డమ్ముఁబట్టియు
బుజ్జగించి యడుగఁబోవ దేని కుత్తరమ్ముసీఁడు చిత్తమ్మునం దప్పు
డప్పు డేమితోఁప నద్దిపలుకు. 30

చ. వదినెయు నన్నయు న్గనఁగ వచ్చినమిత్రులు భృత్యకోటి య
య్యదనున నెప్పు డేమనిన నారయఁ డే రెటు సేవసేయ, న
భ్యుదితకవిత్వశక్తి నెదిరో తనధోరణిఁ దాను వాకొనున్
గదలిచికొంచుఁ బోవఁ బసికాయలవెంటను సాగు నేడకేన్. 31

మ. క్షమఁ దా నుద్భవమందుటాది మునియోగంబబ్బ నందక్క ని
త్యము తాఁ గాంచుచు వచ్చుచుండినవెటోయామైనె పత్రిత్యక్షుదృ
ష్టము లప్డానవికూడ స్వప్నగతపుం జందంబె కా నెప్పు, డె
ద్ది మనోవీధికి వచ్చు నయ్యె దట సందృష్టమ్మునాఁ బల్కెడున్.

ఉ. ఏయదిపల్కిన న్వినినచే, మదినాటెడి నేరికైన నం
దాయుపమానము ల్మఱపు నందఁగసీయని క్రొత్తక్రొత్తవై
మాయురె! యింపునింపెడిని మాటలనాడెడి తేటతెల్గులం
దే యిగురొత్తుభావముల నెల్ల వచించుట వీనువిందుగాన్. 33

మ. అవుటం జేరుచునుండి రాతనిదరి న్వ్యాసక్తచిత్తంబులం
దవులఁగల్గిన బోధము ల్మిత్రుల నానందంబు సంధింప, నిం
కెవరే న్మిత్రులఁ గూర్చికొం చరిగి యింకేవైనఁ గ్రొంగ్రొత్తవా
ని వినంగోరుచుఁ గద్దులుబ్బనగుచున్వీనుల్కడున్నిక్కఁగాన్. 34

ఆ. వందలైరి వేలు పదదాస్య మొనరించు
వార లూర నూరఁ బట్టిత్రిప్పి వాకు లెన్నొ త్రాటియాకుల
కెక్కింప! నెందుఁ దా ముదాహరించికోఁగ,

# శ్రీ వేమబోధామృతసారము

నిద్దమైన తళుకునీల మొక్కటిచాలుఁదళుకుబెళుకు రాలుతట్టెడేల ?
చాటుపద్యమిలనుజాలదా యొకటైన? ననెడుఁదనదు వాక్కులట్టివెయన॥

తలిదండ్రులు.

హరినెజననికాఁగ హరుఁడౌనుజనకుండు వారినుడిగి గుళ్లదూరనేల ?
'పుట్టలోనిచెదలు పుట్టిగిట్టిన' యట్టె మాతృపితల సేవ మానుటనెడు॥

సత్యము.

'సత్యవంతులయెడ సరసమాడఁగరాదు' జ్ఞానమమరియుండు సత్యముననె
యవ్వియున్న యెడనెయబ్బుద్విజత్వమ్ము నామమాత్రునట్లనందగదను॥

కులము.

మాలవాఁడైన మఱియాత్మమీఁదనుమనసు నిలిపెనేనిమాలగాఁడు
'మనసు నిలుపకున్న మహిమీఁద మాలఁడే' కులముగాదు ఘనము
గుణమెయనును॥ 39

అహింస.

హింసఁజేయువాఁడె యిలలోన నజ్ఞాని శంసఁజేయవలె నహింసనెందు
'జీవుఁడేశివుఁ'డని స్థిరమతినున్నెడ జీవహింసఁజేయు చెనఁటియెవఁడు?

విగ్రహారాధనము

జీవులందెకాని శిలలందు లేడెందుఁ గుంభమిడఁగనేల గుళ్లయందు
'రాలెదేవులైన రాసులమ్రింగవా?' తోలుగప్పియున్న దొర
గొలుమను॥ 41

ఆత్మజ్ఞానము.

దేవుఁడంచు వేఱెదేశమందున్నాఁడె? దేవుఁడనఁగఁ దనదు దేహమందె
వాహనంబునెక్కి నడిఁగదలుచునుండువానిఁదెలియనౌను బ్రహ్మవేత్త

తీర్థములు.

'చేతవెన్నయుండ నేతికేడ్చిన'యట్టె తీర్థయాత్రలంచుఁ దిరుగు టెల్ల
'గొఱ్ఱెఁజంకఁబెట్టి గొల్లఁడు వెదకు'మైనాత్మగతమహాత్మునరయకేగ॥43

విభూతి.

బూదియొడలినిండఁ బూయంగ నేమాయె ? నిష్ఠశివునియందె నిలుప వలయుఁ
"గాక బూడిదందు గాడిదపొర్లదా ?" యనును లోలొటారమును నుడుపఁగ. 44

లింగధారణము.

"బందెత్రాళ్లుదెచ్చి బంధించికట్టంగ లింగఁ డేమిదొంగిలించె" నార!
"దొంగగొడ్డుమెడకు దుంగఁగట్టిన"యట్టె యాత్మలింగ మెఱుఁగనంత కనెడు॥ 45

చక్రాంకితత్వము.

తను వొకింతకాల్చికనఁబటాటోపంబుఁబట్టెనామమిడుచుబయలుదేఱె
'వారకాంతఁజూడ వ్రతమెల్ల మఱచురా" యనునుమనముతప్తతనుగ నమిని॥ 46

సన్యాసము.

కట్టినంతమాత్రఁ గాషాయవస్త్రాల మనసుకల్మషంబు మాన్పరాక
తోడరి తిరుగువాఁడెదొరకోలునన్యాసి "తలలుబోడులైనఁ దలఁపు" లౌనె॥ 47

దంభవృత్తి.

"ఆత్మశుద్ధిలేని యాచారమదియేల? భాండశుద్ధిలేని పాకమేల ?
చిత్తశుద్ధిలేని శివపూజలేలరా ?" భక్తిలేనిపూజ పత్రిచేటు॥ 48

చిత్తశుద్ధి.

"కుక్కనందలమునఁ గూర్చుండఁబెట్టుకే." యాత్మనిలుపలేనియజ్ఞుబోధ
మనసునిలుపలేని మంత్రజపంబులు బుద్ధిలేనివాని పూజలల్లె॥ 49
'చిత్తశుద్ధిగలిగి చేసినపుణ్యంబు కొంచెమైన నదియుఁ గొదువగాదు
విత్తనంబుమఱ్ఱివృక్షంబునకదెంత?' యనునదింతయున్న ఘనమవునన॥
"గంగగోవుపాలు గరిటెడైననుజాలుఁ గడవెడైననేమి గజముపాలు ?.
'భక్తిగలుగుకూడు పట్టెడేచాలనుఁ దామసంపుటీవియేమిఫలము ?
ఒడలు బడలఁజేసి యోగి తానెల్లను రాగ మెడలకున్న రాదుముక్తి

"పుట్టమీఁదఁగొట్ట భుజగంబు చచ్చునా ?" వెడలఁజేసి యడఁపఁగడఁ
గుఁడనును॥ 52

గు రు శి క్ష.

ఒక్కపొద్దు సేయఁ బ్రక్కలెండెడిఁగాక మూలమెఱుఁగుదనుక ముక్తిఁ
గనునె ?
"తాళపుఁజెవి లేక తలుపూడనట్టులే" గురులశిక్షఁ గనమిఁ గుఱినిలదను॥53

వి వే క ము.

అంకిలిఁగన మాటలాడ నేర్చినఁ జాలుఁ బిన్న పెద్దతనము లెన్న నేల ?
'పిన్న చేతిదివ్వె పెద్దగా వెల్గదా?' మంత్రబలమె-కాదు మంత్రి దనను॥54
తండ్రికంటెఁ గొడుకు తాగుణియాయెనా పిన్న పెద్దతనము లెన్నవలదు
"వసుధఁ గృష్ణు నెంచి వసుదేవు నెంతురా ?" బాణమందుఁ బూజ
బండకౌనె ? 55
హీననరులతోడ నింతులతోడను బడుచువాండ్రతోడఁ బ్రభులతోడఁ
బ్రాజ్ఞజనులతోడ బ్రహ్మజ్ఞుతోడను వలనెఱింగి పలుకవలయుననును॥

స ద్గు రు ప్రా ప్తి.

'నీరు పల్లమెఱుఁగు నిజము దేవుఁడెఱుంగుఁ' దల్లి తానెఱుంగుఁ దనయుని
జని! పరమ యోగినెఱిఁగి భక్తుఁడు సేరును 'గోతులెఱుఁగ దల్లి నెఱుఁగు'
కొదమపగిది॥ 57

స త్సం గ తి.

'మంచివారు లేరు మహిమీఁద వెదకినఁ గష్టులెందరైనఁ గలరుగద వె
పసిఁడి లేదుగాని పదడెంత లేదయా?' యరుదుముత్తె మెందుఁ గలవెగుల్ల ?
గుణికి కద్దె నమేలు "గోరంత చేసినఁ గొండయౌను" వానిగుణముచేత
గుణవిహీను నెడను గొండంత మేలును జేయ వాని గుణము చెఱచు ననును॥
చంపఁదగినయట్టి శత్రువు చిక్కిన నేగియుడిగి మేలె చేయవలయు
నను ప్రబోధమందియపకారికుపకార మొనరుపంగలత్క్యమును గనుమను
సాధుజనులచెలిమి చాలింపఁగారాదు ప్రకృతివిడుచుదనుకఁ బరముఁ
గనము
"పిందెఁగోసిచూడ బీజంబుగలుగునా?" మాగిమాగికాని యోగికాడు॥

నీచగుణములెల్ల నిర్మూలమొనరించుఁ గొదువలేమసుజనగోష్ఠివలన
"గంధములఁద మేనికంపణఁగినరీతి" నైజగుణము మాపనౌజనునకు॥62
"పాలఁగలియునీరు పాలన"రాజిల్లియదియుఁ బానయోగ్యమైనయట్లు
సాధు సజ్జనముల సాంగత్యమందిన మూఢజనుఁడునందుముక్తినను॥

దుస్సంగతి.

'పాలెతాడిక్రిందఁ గ్రోలుచునున్నను మనుజులెల్లఁగూడిమద్యమంద్రు
నిలువఁదగనిచోట నిలువనింద లెవచ్చుఁదా వెఱింగినిలువఁదగునుగాక॥
'పాలుఁబంచదార పాపరపండ్లతో వండ'నవియుదీనఁబాడవునిలఁ
గుటిలమానవునికి గుణముల్లైకలిగింప బస్మితరముగాదు లెమ్మటనను॥
వేరుపురువుచేరి వృక్షంబుఁజెఱుచును జీడపురువుచేరి చెఱచునాకుఁ
గుత్సితుండుసేరి గుణవంతుఁజెఱుచును దుష్టబోధలెంచుఁగష్టదములు॥

లుబ్ధత.

దాతకడనులోభి తానున్నఁ జెడునీగి"కల్పతరువుక్రిందిగచ్చపొద"గ
విద్యగలిగి కామివితరణి, నైదువు సొమ్ములున్న లేమిసూత్రమట్లె'67
ధనముఁగూడఁబెట్టి ధర్మంబుఁజేయక తానుదినక లెస్సదాఁచులోభి
'తేనె నీఁగ గూర్చి తెరువరికిచ్చు'మై నెవనిపాలొ సేయ నేయ కడిని॥68
'ఇంటిలోనిదెల్ల నిదినాదెయనుకొంచుమంటియందుదాఁచుమంకుజీవి
కొంచుఁబోఁడుమోటగుల్ల కానైనను"దానమీయఫలముదక్కు-నను॥
లోభివానిఁ జంప లోకంబులోపల మందులేమ వేఱె మతముగలదు
పైకమడిగినంత భగ్గునఁ బడిచచ్చుఁ జెయ్యిచాచికాసునియ్యలేక॥ 70

కోపము..

కోపమునను ఘనతకొంచెమైపోవునుగోపమునను మిగులఁగోడు జెందుఁ
గోపమడఁపదానఁగోర్కు-లీడేరెడుఁ'గోప మదియెనరకకూప"మనును॥
గంగపాఱుచుండుఁ గదలనిగతితోడ ముఱికివాగువాఱుమ్రోఁతమీఱ
"దొరలు క్రోధముడుగదోషి కేక్రోధమహా"నిందుకుండ తొనకకుండుఁ
గదవె॥ 72

### మూర్ఖత్వము.

'పరఁగ ఱాతిగుండు పగులఁగొట్టఁగవచ్చుఁ గొండలెన్నొ పిండిగొట్టవచ్చుఁ
గఠినచిత్తుమనముఁ గరగింపరా"దను నిసుకనుండి తైలమెట్టులటులె॥ 70

### అల్పత్వము.

"అల్పుఁ డెపుడుపల్కు నాడంబరముగాను సజ్జనుండుపల్కుఁ జల్లగాను
గంచుమ్రోఁగినట్లు కనకంబుమ్రోఁగునా?' బుడ్డవాగుపాఱుఁ బొరలి'
యనరె ? 74

'చెప్పఁదినెడికుక్క చెఱకుతీ'పెటులల్లెయల్పుపెత్తనాననధికుఁగనమి
'యీఁగకడుపుఁ జొచ్చియిట్టట్టుసేయు'మై హీనుఁడింటఁ జేరుటెడు
మలకను॥

'బొగ్గుపాలఁగడుగఁ బోవునామలినంబు?' హీనుగుణముమానదేమిసదువ
'వేముచేదు సనునె పెంచినఁ బాలతోఁ? గుక్కతోఁక ఋజుతఁగొన
దటయను॥ 76

'కొయ్యబొమ్మఁ దెచ్చి కొట్టి' నం బల్కునా ? యెలుకతోలునుదుక
నలుపణఁగునె ?'
యోగుబాగుఁ జేసియు చిత్రజ్ఞతంగూర్పనెన్ని పాట్లువడినసున్నయనును॥
"గాడిదేమెఱుంగు గంధంబువాసన?'కుక్క యేమెఱుఁగుగొప్పకొద్ది?
'పంది బురదమెచ్చుఁ బన్నీరుమెచ్చునా?' యనుట యల్పుఁడెఱుఁగఁ
డధిక మననె॥ 78

కూళ కూళమెచ్చు గుణవంతుఁ డెడనాడు నట్టివారిమెచ్చు కట్టివారు
'మానుదూలమునకుజ్ఞానంబుదెలియునా?' యోగిసత్తనెఱుఁగుయోగి
గాక. 79

### కూళతనము.

'కుక్కయిల్లుసొచ్చికుండలువెదకుమై మ్రుచ్చుగుడికిఁ బోవుముల్లువిప్పఁ'
బేడఁదిన్నపురువుబెల్లమేమెఱుఁగమిఁ గూళతొత్తుపొత్తుఁ గోనఁజనునను
అల్పసుఖములెప్పు డాసించునీచుండుబహుళదుఃఖములకె పాల్పడినను
'మాలవాడకుక్కమాంసంబుమానునా?' వానికేటిచింత భక్తిసేయ॥

జారత్వము.

కులపుటింతినుడిగి వెలయాలుమేలని వెంటఁదిరుగువాఁడె వెఱ్ఱివాఁడు
"పంటచేనివిడిచి పరిగేరువిధమున" నలుగురెత్తిగినవ్వ వెలితివడఁడె॥82
మగఁడు మదనుఁడైన మంచికాఁపురమైనసహజమేలమానుజారకాంత?
"పిండిఁదిన్నకుక్క పీతికాసింపదా?"యనెడుగర్వఁదెల్పునపరబుద్ధి॥ 83

స్త్రీమోహము.

స్త్రీలముఖముఁజూచి చిత్తంబునిలుకడఁ జేయలేకనరుఁడుచెడెడుఁగాదె
యేటిగడ్డమీఁద నెందాఁక నిల్చురా?'యనెడు నిడుమఁగుడుపనతివ
దరియు॥ 84
వీఁకల కనులకెంతో విభ్రమమొదవించువనితఁజూడ దానివగలఁజూడఁ
గంటిలోనిపాప కుంటెనకాఁడయా విసహమెచ్చనచ్చ వెతలఁబుచ్చు॥85
సతులమాయఁజూచి సౌఖ్యంబుగలదని మతివిహీనులైరి మనుజులెల్ల
గతులుసతులవలనఁగానంగలేగయా వెతలహేతులుగానిమతిఁగనుఁడను॥
వెఱ్ఱివానికైన వేషధారికైన రోగికైనఁ బరమయోగికైన
స్త్రీలఁజూచినపుడు చిత్తంబుగంజిల్లు ననుభవైకవేద్యమనుజగాన॥ 87
వలపుగలిగెనేని వనజాక్షియధరంబు పంచదార కుప్ప పాలతిప్ప
చూతఫలరసంబు జుంటితేనెసుధీయవలపులుడుగనెడలువట్టినోరిఁగ॥ 88
మనువుతీపుకోరి మక్షికంబులుపెక్కు వచ్చి వెడలలేక చచ్చినట్లు
మునిఁగి వెడలలేరుమోహంబురాశిలోఁ బడినమానవాళిచెడిమడిసెడు॥
అన్నమధికమైన నదె మృత్యువుం దెచ్చునన్న మంటమన్న సట్టులెయగుఁ
జంపఁబెంపబూవె వాలదా? వేయేల?మితమెఱుంగకున్న హాతికదనును॥

దురాశ.

'కాంచనంబుపైనఁ గాంతలపైనను బమ్మకైనఁ బుట్టు రిమ్మతెవులు'
తోయజాక్షివిడుచు దొరయెవ్వఁడున్నాఁడు?నాఁగ సాక్షి హృదయ
మాఁగ దెటను॥ 91
'పాలవార్ధిలోనఁ బవ్వళించినవాఁడు గొల్లయిండ్లపాలు గోరనేల ?
యెదుటివారిదైననెల్లవారికినాస'యనుటసర్వహృదయగుని కెరుసరు॥
'కనకపర్వతమునఁ గాఁపురం బుండిన ననిమిషేశ్వరునకు నాసపోదు

కపచకుండలాలఁగర్ణునినడుగఁడా?' యనుటఁదెలుపు నాసకంతులేమి॥
చదువులందు లిబ్బిమొదవులందును స్త్రీలపెదవులందు తేనిపదవులందు
నాశలేనివారె యవనిలో లేరనుఁ బేర్మిఁగనుటయందుఁ బ్రీతియట్లు॥94
ఆశచేత మనుజు లాయువుగలదాఁకఁదిరుగుచుందురిభ్రమను దిప్పలేక
'మురికిభాండమందుముసరుసీఁగలభంగి'నైహికేచ్ఛమలఁగుటంతదెకద
నీటిలోనిమీనునెఱనెప్పై నాస గాలమందుఁ జిక్కుకరణి ధరణి
నాసఁదగుల నెవ్వఁడాలాగెనశియించునాశవిడమి బ్రహ్మమందదనును॥

మోహహీనయము.

ఆశనాపుకన్న నతిశయం బింకేది? చూపునిలుపుకన్న సుఖమదేది ?
మనసునిలుపుకన్న మఱిముక్తిదేదనా? వేమహితముకన్న వెరవికేది?97
ఎట్టివానికైనఁ బుట్టునుమోహంబు పుట్టుమోహమెల్లఁబూడఁద్రొక్కి
గట్టిచేసిచూడఁ గనిపించుబ్రహ్మంబు దానిఁగన్న వెనుకమానఁడనును॥
ఆలిముందువంపకథముఁడై తావెన్కవిహ్వలుండుగాఁగ వెట్టితనము
'చెట్టుముదురనిచ్చి చిమిడినం బోవునా?'యనును దిద్దుమెద్ది యాదినె
యన॥ 99
తామసించి చేయఁదగ దెట్టికార్యంబు వేగిరింప నద్ది విషమెయౌను
'బచ్చికాయఁదెచ్చి పడవేయఫలమౌనె?' పండుపటుకు నుండవలె
నటనును॥ 100
తిరుగవలయుమనసుతిరిగినయందాఁకఁదిరిగినట్టిమనసు విఱుగవలయుఁ
దిరిగివిఱిగనేనిదేవుండె తానానటను నిజానుభవము గనజగాన॥ 101

దోషపరిగణనము.

ఆదికాలధర్మ మల్పుం డెఱింగియుఁ జెప్పలేఁడుగాని తప్పుఁబట్టుఁ
"దోయనేర్చుకుక్క దొంతులుపేర్చునా?" యనెడు నల్పగుణ మ
దట్టిద యన॥ 102
తప్పులెన్నువారు తమతప్పులెఱిఁగిన నోరులతప్పులెన్నఁడరయఁబోవ
దుర్జనులనెవనికుండదుతప్పెందుగోనమెకోనుమటనునుగుణగణనను॥
ఉప్పులేనికూర యుండునె రుచ్యమై పప్పులేని విందు బాగపౌనో !
[illegible]॥104

ఎంతసున్నితంబొ యంతకుఁగఠినంబు మనమునొరులదెట్టిఁగి మసల వలయు
వినుము నదుకవచ్చుమనముఁగూర్పఁగరాదుమాటమిగులకుంటె మంచి దనును॥ 105

గుణియె మలయజంబు కులవనంబింపొందమల్లెలందవగుణియుల్లి పూవు
తనయు దుశ్చరిత్ర తండ్రికీర్తిహరించుఁజెఱకునెన్ను చవిని జెఱచుపగిది॥

కలిమిలేములు.

కులములేకయున్నఁ గలిమిచేవెలయును గలిమిసర్వభోగములకు నెలవు।
కలిమిఁగన్న మడుగుకప్పలబెకబెకవలెనెయర్థులెంచఁగలుగుయశము॥
* ఈఁతకంటెలోఁతు నెంచంగఁ బనిలేదు చావుకంటెఁగీడు జగతిలేదు
గోఁచిపాతకంటెఁగొంచెంబుమఱిలేదుతనియగొప్పకొద్దులనుగనము॥
'నీళ్లలోని మొసలి నిగిడి యేనుఁగులాగుబైటఁగుక్కచేతభంగపడును
స్థానబలమెకాని తనబల్మికాదయా' యనునుదా వెఱింగిమనుమనుటకె॥
అనువుగానిచోట నధికులమనరాదు విజయుఁడిముఁదప్పివిరటుఁగొల్వఁడె?
"కొండ యద్దమందుఁగొంచెమైయుండదా?' కొదువగాదుదానఁగొంచెము నను॥ 110

లోకానుభవము.

ఆపదలను బంధుతాదరణంబును భయముగల్గువేళ బంటుతనముఁ
బేదతనమునందుఁబెండ్లమునడవడిచూడఁదగునటనెడుజాడఁదెలిసి॥ 111
'చంపనున్న రాజుచనువగ్గలముసేయుఁజెఱపనున్న వాఁడుచెలిమిసేయుఁ
గఱవనున్న పాము నెఱిదాఁచుకొనియుండుఁ' బైనఁజూచిమోసపడకుఁ డనును॥ 112
'చెప్పులోనిఱాయి చెవిలోని జోరీఁగ కంటిలోనినలుసు కాలిముల్లు
నింటిలోనిపోరు నింతింతకా'దన ననుభవైకవేద్యమందఱికిటు॥ 113

ఐహికచింత.

కడుపుకొఱకునరులుకళవళపడెదరుకడుపు చల్లనైనఁ గలదుభక్తి
కడకుజాతిలోని కప్పకు లేదాకో! నారువోయువాఁడె నీరొసఁగఁడె?

"రాజవరుల కెల్ల రణరంగములచింత పరమమునుల కెల్లఁ బరముచింత
యల్పనరుల కెల్ల నతివలపైఁ జింత" డాంబికులకుఁ గీర్తనంబుచింత॥ 115
సుతునివల్లఁ బుణ్యసుఖమందఁగలనని మనుజుఁ డెంచుఁగర్మమతమునమ్మి
యేనుఁగుపడియున్న నెత్తునా మశకంబు? కనుట నాత్మశుద్ధిఁ గద విముక్తి॥
సతులఁ గోరనేల? సుతులఁ బడయ నేల? వెతలఁ బడుట వెల్ల వెఱ్ఱితనము
'నేలనున్న జాయి నెత్తి కెత్తినయట్లు' బడుగుసంస్కృతులకుఁ బొల్పుడుట కె
తరుణిసుతులు ధనము ధాన్యంబు సంపద యెంత చుట్టుకొనిన నంత చేటు
'పసిరికాయపురువుపద్ధతిఁ గానరో!' బెడదమునుగకున్న నెడఁద తేరు॥ 118

## వైరాగ్యము.

తనను జూచి యొరులు ధర మెచ్చవలెనని సొమ్ము లెన్నొ పెట్టు నెమ్మి మీఱ-
నొరులకొఱకుఁ దానె యుబ్బుటకంటె నుదనను ముందు తెలియఁదగు
నటనును॥ 119
మురికిలోనె పుట్టి మురికిలోనె పెరిఁగి మురికి బ్రదుకుకొఱకు మురిపె మేల?
మురికి నెఱుఁగు వెనక మురికిలోఁ బుట్టునా? తోలుబొమ్మలాట చాలు నరక॥
కడుపునిండ మలము కడమ నివి యెముకలు నరసి చూడఁ బైది మురికితోలు
నిట్టి దేహమందు నేటికో మోహంబటనును మురికి నుడిగి యాత్మ నెఱుఁగ॥
ఏమి కొంచు వచ్చె నేమి తాఁగొనిపోవుఁ బుట్టువేళ నట్టి గిట్టువేళ
ధనము లెచటికేగుఁ దానేగు నెచటికి? నిద్ది తలఁప కేలయించు నరుఁడు॥
జారపురుషుమీఁద సద్భక్తి నెఱపుచుఁ బతికి నిచ్చకముగఁ బరఁగు భంగిఁ
బరముఁ గోరు యోగి పాటించు దేహంబు నల్ల కాటి కెపుడు నంపుటనుచు॥

## జ్ఞానమార్గము.

సొమ్ముగనెడు దాఁక జ్యోతిగావలెఁ గాని సొమ్ముఁ గన్న వెనుక జ్యోతి యేల?
దేవుఁ డైన లేదు దేహంబు చిక్కనుఁ దాను బ్రహ్మమైనఁ దను వెలేమి॥
పసుల రూపు వేఱు పాలొక వర్ణమౌఁ బుష్పజాతి వేఱు పూజ యొకటె
దర్శనములు వేఱు దైవంబ దొక్కటే పేరు లెన్ని పెట్టి పిలువనను॥
మాటలాడవచ్చు మనసు నిలుప రాదు తెలుపవచ్చుఁ దనను దెలియఁగాదు
ఛురియఁ బట్టవచ్చు శూరుండుగా రాదట నెడుజ్ఞానమబ్బు టరుదనంగ॥

### మనోలయము.

అనఁగ ననఁగ రాఁగ మతిశయిల్లుచునుండుఁ దినఁగఁ దినఁగ వేముతియ్యనుండు
సాధనమునఁ బనులుసమకూరుధరలోన నెందుఁ గాని నేర్పొకింతయున్న॥
అంతరంగమందెయభవునుద్దేశించినిలిచి చూడఁజూడ నిలుచుఁగాక
'బాహ్యమందుశివునిభావింప నిల్చునా?' యనెడు నాత్మఁగూర్చిమనన మెనయ॥ 128

కడుపుచిచ్చుచేతఁ గామానలముచేతఁ గ్రోధవహ్నిచేతఁగుటిలపడక
యొక్కమనసుతోడనుండినప్పుడెముక్తి మనసుమనసునందెమాసిపోవ॥

### అంతరదృష్టి.

ఆత్మలోనిజ్యోతి యమరెడులింగమై తెలిసి చూపకున్నఁ దేటపడదు
"గుడ్డివాఁడెఱుఁగునె గుర్తింపరత్నం" బటనునుదృష్టినలయు నాంతర మన॥ 130

ఘటజలంబులందుగగనంబుఁ గననౌనుఘటముజలములేమిగగనమేది?
ఘటములోనిజ్యోతిఁగ్రమమునఁ గనవలెననెడు నాంతరంబు నరయ నరుఁడు॥ 131

### బ్రహ్మసాక్షాత్కారము.

చదువులందులేదు శాస్త్రంబులనులేదు వేదములనులేదు వాదములను
నొడలిశుద్ధిఁ జేసియొడయనిఁజూడుమంచెడఁదకుదుటఁబడిననేకపునును.
తనదులోనివాని తత్త్వం బెఱుఁగక వే లటంచుఁదలఁచివెదకులెల్ల
భాను వెదక దివ్వెఁబట్టినచందమౌఁగాక దానిమించికలదెటనను॥ 133
మంటికుండవంటి మాయాశరీరంబు చచ్చునెన్నఁడైనఁ జావదాత్మ
ఘటము లెన్నియైన గగనం బదొక్కటే యనునుడాఁ బరాత్మయుని ధృవపడ॥ 134

పరము పరమటంచుఁ బల్కుదు రందఱు పరమునందదేదిప్రబలమయ్యెఁ
బరముఁడిందునందుఁబరిపూర్ణుఁడేకదాయనఁ బరాత్మలేనిదరయనెటను
లోనుజూడఁజూడలోకాభిరామంబు బయలుసూడఁ జూడబంధనంబు
తననుజూడఁజూడఁదారకబ్రహ్మంబుననుచుసాధనంబునందఁ జేయు.136

ఆత్మదేహమందు నతిసూక్ష్మముంజూచిదేహమాత్మయందుఁదేటపఱచి
యాత్మయందె చూడ నతఁడెపో ఘనయోగి యని యెఱవర్చుఁ గరత
లామలకము॥ 137

అద్వైత సిద్ధి.

ఆత్మయందెదృష్టి ననువుగా నొనరించి నిశ్చలముగ దృష్టి నిలుపుదేని
యతఁడు నీవయాదుననుమాన మేలనునద్వయప్రబోధమమరనెందు॥
'త్రాడుపామటంచుఁదాఁజూచిభయపడుఁదెలియఁద్రాడటంచుఁదీఱు
భయము
భయముదీఱినంత బ్రహ్మంబునంటురా" యనుటభ్రాంతులుడుపు నద్వ
యాప్తి॥ 139

నిద్రలోనినిద్రనిజముగాఁదెలిసినఁ దామసంపునిద్రఁదలఁగఁద్రోయు
నిద్రఁదెలిసినతఁడె నిజమైనయోగిగాభద్రమానటనును బ్రహ్మవిద్య॥
జననమరణము లివె స్వప్నసుషుప్తులు జగమునం దనేకజనములుండు
రవనిలోనిజనములరయంగ లేరిద్ది తెలియస్వప్నదృష్టములివికావె? 141
పగలు రేయిమఱచిపరభావముమఱచితానునే ననియెడితలఁపుమఱచి
యుండఁగలిగినపుడె యుత్తమయోగమానను చుఁ దనదు స్థితిని గనఁ
దెలిపెడి॥ 142

వార్త లోనివార్త వరకవింజేయంగ నట్టివార్తమహిమ నరయనిట్లు
గట్టిచేసినిలిపెఘనుఁడెపోశివయోగివిశ్వదాభిరాముదినఁగ వేమ. 143

ఉపసంహారము.

ఆ. పేర్మిఁ గంచు నిలుచు వెరవొందఁ బ్రిత్తి ప్త
ములకు నందు సందు కలుగుఁగాక నిరుపమంబు లుపమ లొరుల
కెట్లుస్ఫురించు? వేమహితముఁ గన నివే మహితము॥ 144
ఆ. గురుకటాక్షమునను గురుతరం బైనట్టి
మహిమగలప్రబోధమిహమునందుబంగరువలెనిల్పబంగారముంజేసె
నన్న మహిమలేవొ యరయనేల ? 145
తే. హేమతారకవిద్యసాధింప నొకటఁ
దనకు నభిరాముతోడిసందర్భమొదవఁ

బొందువడుచుంటరసవాదమందభిరుచి
వాసనాలేశమేకాదుపసిడివాంఛ 146

తే. పారలౌకికదృష్టినేపరఁగుయోగిసచ్చిదానందపున్బ్రహ్మసక్తినుడిగి
ప్రకృతినాభాసికానందపరతఁగనునె? తానుగవిమైన దోషనిందలఁ
గడఁగక. 147

తే. సర్వసమదృష్టి వేదాంతిసరణియాట
లోకకల్యాణమునుదాననేకదయని
తనకుసమముగనెల్లరుమనవలెనను
సంఘసంస్కారకీర్తిఁ గాంచంగఁగాదు. 148

తే. తననిరూఢికిదాననుమననమెనయనాత్మబోధముగాఁ బలుకనట్టిదేది
యొరులద్వేషానగర్హించు తెలుఁగు గాదు రక్తి యుడిగినవానివిరక్తి
విధము 149

ఉ. కాఁగ యథాతథంబు లయి కావ్రిల జగంబున సూక్తిరత్నముల్
ప్రోఁగొనరించి చూప జతువు నొ్బదువ న్నిజవాక్యసంధిగాన్
డాఁగునె తత్ప్రభల్? ల్మొద మిడంగ రసజ్ఞులు శిల్ప మెంచరే?
బాగవు నోగిదేదయిన వాక్కులు యోగివి చక్కఁజేయవే? 150

ఉ. తీయని యచ్చతెల్గులును దేటగుమాటలు నూటలూరు జా
తీయము జీవమై వెలయఁ దేజము రూపము నవ్యభావసం
ధాయకమై యెసంగ జనతాసుగమంబయి తెల్గు గడ్డపై
నేయెడ నెట్టిపామరున కేనియు నింపయి నిల్చిపోవఁగాన్. 151

ఉ. సారవచోవివేకమున శ్రావ్యపదాల సమన్వయంబు లిం
పార విమర్శితప్రకృతియై విలసిల్లఁగ, సర్వలోకసా
ధారణసంగతు ల్మదికిఁ దట్టిన నెట్టన నాటునట్టు వి
స్తారనిరంకుశత్వమున సంస్కృతి వాఱఁగ దూఱఁజొచ్చినన్.

చ. కవిహృదయానురూపములు గాఁదగు మార్దవ మార్ద్రతాదులం
దవులక, రోషభాషణలు దార్కొనఁ బల్కిన నందు నెందు హా
స్యవిధమె తోఁచుటం, గనమి స్వార్థ మ దేరికిఁ గాక కోపహే
తువు, నవుఁగొల్ప లాఁతులను దూఱిన రీతులఁ బ్రీతులైతగన్,

చ. ఎదను లయింపఁ జేసికొని యేయది బుద్ధికి నెప్డుతోఁపన
య్యది యను యోగివాక్యములకు నాగ్రహమందుట వెఱ్ఱికాదె? జ్ఞా
నదమునఁ బల్కు యందఱను జ్ఞానులఁ జేయఁగ, లోకమెల్ల వె
ఱ్ఱివి యనుకొనెతండును, దరింపఁగ నేరమి నట్టి వీరనన్. 154

తే. రాజయోగమునం బ్రీతి రాజిలంగఁ గడకు మౌనము వహియించి
కాంచి మించి
యంచితమ్ముగ బ్రహ్మమయత్వ మెంచి। యంచె లీనంబు నిందె
యుండందలంచి॥ 155

ఉ. పుట్టిన 'మూగచింతల'ను బొంపిరివోయినఁ 'గొండవీటి'లో
మెట్టిన 'గండికోట'ఁ గడిమింగన 'బాట' 'కటారుపల్లె' కుం
బట్టిన నింక నెందయిన వాసముగల్గినఁ దెల్గునాఁటియం
దెట్టివి మాటుమూలలను నెక్కు యశోలత లల్లిబిల్లిగాఁ. 156

సమర్పణము.

చ. గురువర! మీపదాబ్జములకు న్నతిసేయఁగ రంగదాసుని
న్వేర వెలుఁగం దరింపఁ 'జనవేమన!' యంచనుపద్యజాలముల్
విరివిగ నాశుపద్ధతిని వీనుల కెక్కఁగఁ జేయ బాల్యమం
దిరవుకొనె న్మనంబున నదేయవు వేమనయోగి రీతిగాన్॥ 157

ఉ. ఓయిమహానుభావ! కవియోగివరోత్తమ। పూరుషోత్తమా
ఖ్యాయుత దక్షిణాంగ చరణాంబుజ భృంగమ! యిట్లు "వేమయో
గీయ" సమర్పణంబునను గీలితసత్పదుఁ జేయు దీన, యిం
దేమెడఁ గల్గిన న్గుణ మొకింత యదెల్ల భవత్ప్రసాదమే॥ 158

ఆశ్వాసాంతము.

మ. పరమోత్కృష్ట చతుర్విధాంధ్ర కవితా ప్రాచుర్యమాణాద్భుతో
త్తరరామాయణ, సూరివర్య "గురుభక్త్యుత్కృష్ట' కృష్ణానదీ
గరిమా" ద్యుత్తమ సత్ప్రబంధరచనా కౌతూహలాయత్త చి।
త్త రమద్వైభవ దక్షిణాస్య కృత మేధాపూర్ణ విద్వన్మణీ! 159

మాలిని: అవిరళ కృతిపూర్తీ! వ్యాప్తవిద్యాప్రపూర్తీ!
ధవళ బహుళ కీర్తీ! ధర్మ కర్మానువర్తీ।

భవదళిత భవార్తీ! భంజి తాఘౌఘ జూర్తీ!
పరివిమల గురుమూర్తీ! ప్రాపితానందమూర్తీ! 160

## గద్యము

ఇది శ్రీ మేధా దక్షిణామూర్తీశ్వ రాక్షీణ కరుణాకటాక్ష వీక్షాపాత్ర
నాదెళ్ల పురుషోత్తమ కవీంద్ర పుత్త్ర మేధా దక్షిణామూర్తిశాస్త్రి
నామధేయ విద్వద్విధేయ కర్తృక శ్రీ వేమయోగీయంబునందు
సర్వంబును జతుర్థాశ్వాసము.
శ్రీ గురుపాదార్పణమస్తు.



## సవరణలు

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 20 | 5 | జాత | జూత |
| 35 | 4 | యడుగు | యుడుగు |
| 42 | 11 | వక్షి | పక్షి |
| 42 | 16 | రాంతస్థ | రాంతస్థ్స |
| 44 | 10 | వజ్ర | వజ్రి |
| 47 | 21 | కబాప్త | కబ్జాప్త |
| 53 | 24 | మాళ్ళి | మాళి |
| 65 | 13 | నిష్క్రి | నిషిక్రి |
| 65 | 17 | బుబాయు | బుంబాయు |
| 68 | 7 | రిశార్ధ్జ | రిశార్ధ్ఞ |
| 71 | 5 | గుటప్ర | గురుప్రి |

# కవియోగీంద్రులగు

కృతినాథుల చరిత్రమైన "ఉత్తమజీవయాత్ర"ను జదివిన మతికొందఱి యానంద మీ మాదిరి నున్నది.

---

## చతుశ్శాస్త్ర కోవిద శ్రీ చివుకుల వేంకట రమణశాస్త్రిగారు

'ఉత్తమ జీవయాత్ర' ను బరమానందముతో నామూలాగ్రము పఠించితిని. 'జగమెఱిఁగిన బ్రాహ్మణునికి జన్నిదమేల ?' యను సూక్తినిబట్టి శ్రీవారి గుణగణముల నభివర్ణింప నగత్యమే లేదు. "పులికడుపునఁ జలిచీమ పుట్టునా?" యను సూక్తికృతికర్తలగు మీయందు రూఢమైనది. గ్రంథస్థ విషయమా యథార్థము. కృతియు నట్టి యథార్థమే.

## 'ఆంధ్ర జయదేవ' శతావధాని శ్రీ చల్లా పిచ్చయ్యశాస్త్రిగారు

గ్రంథనామములోనే మహానందము కలిగినది. కృత్యాదినుండి ఫలశ్రుతి వఱకుఁ జదువునప్పుడు పొంగి పొరలి నట్లైనది. జగత్ప్రసిద్ధ పురుషోత్తమ కవిచంద్రులయిన మీతండ్రిగారి పరమపవిత్రచరిత్ర పాఠకలోకమునకు జననాదిగా నడవడి, మహిమ, సల్లక్షణము, సంసిద్ధి గురుప్రబోధప్రభావము మున్నగు దైవసంపత్తెంతో ఆదర్శకముగాఁ దెలియఁజేయుచున్నది.

మీ రచన, ఆశ్వాస విభాగనిర్ణయము, విషయ నిర్ధారణమును బూర్వ లాక్షణిక వచనానుసారముగా ఆకాంక్షోత్థాపకములుగా నున్నవి. కవితా సామగ్రి నెన్నికంగన్న ధారాశుద్ధి, చమత్కృతి, మాధుర్యము, ద్రాక్షాపాకము, లోకోక్తులు మొదలైన వన్నియు శ్రీ క్షేమేంద్రోక్తమగు 'ఔచిత్య విచారచర్చ' ననుసరించిన దైన యౌచిత్యపోషణముతోఁ బ్రస్ఫుటమగుచున్నవి. మీ 'యుత్తమ చరిత్ర" నిస్సందేహముగాఁ బఠనమాత్రమున లోకమును దరింపఁజేయునని నా గాఢవిశ్వాసము.

ఉ. ఉత్తమమధ్యమాధముల కున్నతి, కష్టము, నష్టమాట, సం
పత్తి విపత్తులాముకొనఁ బ్రాజ్ఞసమత్వము, ధర్మబోధముం
జిత్తవిశుద్ధి మున్నగు విశేషములన్నియు తెల్పుచుండు, లో
కోత్తరమైన భవ్య పురుషోత్తము "నుత్తమ జీవయాత్ర" తాన్.

## శతావధాని విద్వాన్ శ్రీ దోమా వేంకటస్వామి గుప్తగారు

శా. సాదెళ్లాన్వయ పూరుషోత్తమ కవీంద్రస్వామి యస్మద్గురు
శ్రీదైవాఱునతం "డిల న్వదలి పోంచేసె న్వరం" బన్న మా
టీదెందానకు వజ్రపాతమటు హోయిందుల్ల వీతెంచెముం
దాదృఙ్మాన్యుఁడు తత్సుతుండవుటఁ జిత్తంబంద దేశంకయుం॥

ఉ. విద్దియఁ గల్గువారలను బిట్టినవారిని గాంచుచుందు. మా
హృద్దశ వారి కెచ్చుగనొ, యించుకయో యెటు లుండకుండ, దీ
యిద్దులు పూరుషోత్తముల కెందు నహంకృతి గానరాదిఁకన్
బద్ధసహాళ్ళి యీయఁదుల భవ్యులకు న్నమకార మారయన్॥
శా. నూలంబయ్యును నూత్నరూపము మతిస్ఫూర్తిం బ్రకాశింపను
ద్వేలానందమయప్రశాంతమగు విస్ఫీతి న్భవిం బొల్చె; నా
దేశశ్రీకుల పూరుషోత్తముఁ డహా! దిఙ్మండలీ మండన
ప్రాలేయాంశు యశోవిలాసుఁ డతని న్బల్కొందగు న్నిచ్చలున్.

శ్రీ అప్పల వేంకటరావుగారు, పౌరాణికులు, సామర్లకోట

మీయనర్గళ కవితాధార, మృదుమధురశైలి, యమకము, అంత్యానియమము, సరసప్రయోగములుగల ద్వ్యర్థిపదజాలము మున్నవున వెన్నోచూడ మనస్సుప్పొంగినది. శ్రీ పురుషోత్తమకవిగారి జీవితచరిత్ర మాబోంట్ల కాదర్శప్రాయమై యున్నది. మీరు చూపిన పితృభక్తియు నేర్చికోఁదగినట్లు బోధించుచున్నది. మీవంటి పెద్దలఁ బ్రశంసించునంతటి విద్యాబుద్ధులు మాకు లేకపోయినను మావంటి కవితావ్యాసంగపరులను సజ్జనవిధేయులను ప్రోత్సహించు మీకు నామనస్సంతోషమును ధైర్యముగా వెల్లడించిన యీ నాసాహసవాక్యములందలి దోసఁగుల మన్నించి యాదరింపఁ బ్రార్థితులు.

గుంటూరు హిందూకాలేజి రిటైర్డు ప్రిన్సిపాల్

శ్రీ బుద్ధిరాజు రామచంద్రరావుగారు M. A. L T. (Litt & Hist)

షేక్స్పియర్ మహాకవి 'యీ ప్రపంచకము నాటకరంగ'మనియు, వ్యక్తులు పాత్రలనియు బలుమారు నుడివియున్నాడు. మీరు మీ పితృపాదుల జీవిత చరిత్రను నాటకలక్షణములతో నలంకరించుటచే గడుయుక్తముగా నున్నదని నా యభిప్రాయము. ఏలయన, మీ పితృచరణులనాటి సాంఘికయుగము విశిష్టమైనది. సాంఘిక సారస్వత వివాదములను గడువైదుష్యముతో దిద్ది సమన్వయముచేసిన వ్యక్తులలో మీ తండ్రిగారు మేటియని చెప్పుట యతిశయోక్తి కానేరదు. వారికి సర్వతోముఖమైన పాండిత్యము, సాహిత్య సమన్వయశక్తియు సమానముగా నబ్బియుండుటవలన వారి యత్నములన్నియు నిర్విఘ్నముగా నెరవేరినవి. నా చిన్ననాడు శాస్త్రిగారిని గడువీరుడని ప్రశంసించుచుండెడివారము. వారి జీవితచరిత్రము ఈతరమువారికి గూడ నాదర్శప్రాయము.

మీ గ్రంథము జీవకళలతో గూడి యప్పటి సాంఘిక జీవితము చక్కగా బ్రదర్శించుచున్నది. ఆంగ్లవాఙ్మయములో బాస్వెలు వ్రాసిన ''జాన్సను జీవిత చరిత్ర''తో దుల్యముగా మీ గ్రంథరాజము మన ఆంధ్ర వాఙ్మయములో విలసిల్లునని నాయాశయము.

శ్రీ మలపాక సూర్యనారాయణగారు రిటైర్డుస్కూల్సు ఇన్స్పెక్టరు:

'ఉత్తమ జీవయాత్ర' యను గ్రంథరాజము మీచే మిక్కిలి చక్కగా వ్రాయబడినది. పలువురకు ఆదర్శప్రాయమైన జీవితముగాన బాలకులు నేర్చుకొని అనుకరింపదగిన విషయములు పెక్కులుగలవు. వారి పాండిత్యము, బహుభాషా సేవ, సాంఘిక సేవ, కార్యదీక్ష, సనాతన ధర్మాభిమానము, ముముక్షుత్వమును చిరస్మరణీయములు. మీరు 'పండిత పుత్రు'లను పదమునకు గొప్ప అపవాదమును కలుగజేసిన పుత్రరత్నముల రైతిరి.

గ్రంథకర్త్ర సతీర్థ్యులందలి

శ్రీ కాసుఖేల రామారావు పంతులు, అడ్వకేటు, నెల్లూరు.

గ్రంథముచూచు కొలదిని మన చిన్ననాటి సంగతులు స్ఫురణకు వచ్చినవి. అందులకు నేనుబ్బులూగుచున్నాననుట అతిశయోక్తి కాదు. ఆధ్యాత్మిక చింతతో గాలముకడపుచు 'అవలోకయమాం అకించనానాం' అన్నట్లు కరుణాపూరదృష్టిసారించి అనుష్ఠానమునందు నన్నొక భాగస్వామిని జేయవలెనని నా ప్రార్థన.

రిటైర్డు సబ్ జడ్జి శ్రీ సురభి తులసీదాసు నాయుడుగారు, మద్రాసు.

పూజ్యపాదులగు తమపితరుల సర్వతోముఖ చరిత్రమును పద్యకావ్యముగా వ్రాసి పితౄణమును దీర్చుటయేకాక, ఆంధ్రభాషామతల్లికి ఒక అమూల్యమైన అద్వితీయమైన కానుకను సమర్పించి ధన్యులైతిరి. ఉత్తమశ్రేణి చరిత్రకారులలో దమ కగ్రస్థాన మియ్యబడుననుటలో సందేహములేదు. తండ్రిగారి జీవిత చరిత్రము పద్యకావ్యముగా వ్రాయుటయెంతయో కష్టము. తమజనకు లన్నో గొప్పకవివరేణ్యులు, బహుళ గ్రంథకర్తలు, బహుభాషావేత్తలు, అసామాన్య జ్ఞానసంపన్నులు, నిష్కళంకమైన కర్మయోగి. అట్టివారి జీవితచరిత్రమును చిత్రించుటయో బహుళప్రయాసము. తమ వైదుష్యము, పితృగౌరవమువలన, ఈ చరిత్రమును మిక్కిలి ప్రశస్తముగా వ్రాయగలిగినారు. తమ జనకుల చరిత్రము నింకెవ్వరును ఇంతబాగుగా రచింపజాలరు. తమ "ఉత్తమజీవయాత్ర" ఆచంద్ర తారార్కముగా ఆంధ్రభాష యున్నంతవరకు స్థిరస్థాయి గాగలదు. తమ రిట్టి ఉత్తమగ్రంథ రాజమును లిఖించి ఆంధ్రభాషాభివృద్ధికి చేయూత నొసంగినందులకు ఆంధ్రభాషాభిమానులెల్లరు మీ యెడల కృతజ్ఞులై యుండగలరు.

మద్రాసు లా కాలేజి ప్రిన్సిపల్

శ్రీ జి. సి. వేంకటసుబ్బారావు గారు బి, ఎస్, సి, యం, యల్

'ఉత్తమ జీవయాత్ర' ను బఠించి ధన్యుడనైతిని. సమకాలికులచే రచింపబడి, మహాకవుల జీవితచరిత్రనుదెల్పు గ్రంథములు మన ఆంధ్రములో లేవనియే చెప్పనగును. అట్టిచో, ఉభయకవివతంసులగు శ్రీ పురుషోత్తమ కవీంద్రుల అమర గాథను హృద్యంబగు కావ్యంబుగా మీరొనర్చుట యెంతేని శ్లాఘ్యము.

ఈ గ్రంథరాజమందు వెల్లివిరిసిన మీ పితృభక్తియు, నెల్లెడల దెల్లంబగు మీ బహుముఖ పాండితియు అమేయములు.

మద్రాసు హైకోర్టు జడ్జి కీ. శే. చింతగుంట రాఘవరావు గారి జ్యేష్ఠ పుత్రుఁడును, అడ్వకేటును ఆంధ్రీకృత మేఘసందేశాది గ్రంథకర్తయునగు

చిరంజీవి శ్రీ సూర్యనారాయణరావు, గుంటూరు

సార్థక నామధేయులుగాఁ బరఁగిన మీ తండ్రిగారి చరిత్రాంశములకు విమలదర్పణముగా మీ రచన విరాజిల్లుచున్నది. అందలి మీ తండ్రిగారి జీవన ప్రత్యేకతా చిత్రణము వారినిజూచి యెఱుఁగనివారికిఁ గూడ వారి ఆదర్శ మూర్తిని బ్రత్యక్షీకరింపఁ జాలినదై పరిపూర్ణ చైతన్యముతో నలరారుచున్నది. మఱియు నద్వితీయమై, గురుభక్తిభావ పరిపాక ద్విగుణితమై, స్ఫటికవిశదమై, స్ఫుటవిన్యాసముతో నీ గ్రంథమున గోచరించు మీ పితృభక్తి యపరిణత వయస్కులగు బాలబాలికల బుద్ధిలతలకు మారాకుగాఁ బ్రవర్తించి, యాదర్శమనదై స్వాయముగా హితమొనగూర్పఁ గలుగుననుటకు సందియము లేదు. ఆంధ్ర సంస్కృతభాషల లోతుపాతుల యభిజ్ఞతకు నికషోపలమైన యీ పుస్తకము నందలి రచనావిధానము మసృణ రసాత్మకమై భావబంధురమై, సుందర కావ్యాలంకార శోభితమై, గంభీర కోమలపద హృదయంగమమై, పఠితృలోకమునకు నిత్యనూతనానందవికాసములను సంక్రమింపఁజేయుచుఁ బాఠయోగ్యముగానున్నది.

ఈ పుస్తక రాజమందలి 'కవితాస్వయంవర' ఘట్టము అనుపమమై యననుభూతపూర్వమగు నానందమును గలిగించినది. ఆంధ్రవాఙ్మయమందొక క్రొంగ్రొత్త కల్పనగా నది నాకు ద్యోతమై నామేను పులకరింపఁజేసినది. కృష్ణానది వీడ్కోలుపద్యములు కాశీఖండములోని తాదృశఘట్టమునందలి శ్రీనాథమహాకవి పోకడను స్ఫురింపఁజేసి యలరించినవి. 'శైశవదుష్టశిక్షణము' లోని సరళభావసంపదావిష్కరణమన్ననో యమోఘ స్వాభావికోక్తిబంధురమై యున్నది. ఆదినే యెదురగు సముద్రనివిలయతాండవ ఘట్టము 'ఆముక్తమాల్యద'లోని ప్రకృతి వర్ణనల నిద్దపురీతుల కుద్దియై విలసిల్లుచున్నది. అధిక ప్రసంగమునకు క్షమార్హుఁడను.

| | |
|---|---|
| శ్రీపురుషోత్తమ కవీయము (ప్రకృతి వికృతి, రూపాంతర నిఘంటువు) | 3-0-0 |
| ఉత్తమ జీవయాత్ర (పురుషోత్తమ కవీంద్రచరిత్ర 6 ఆ పద్యకావ్యము) | 3-0-0 |
| వేమనసూక్తి రత్నాకరము (4035 వేమన పద్యాలు-సచరిత్రము) | 3-0-0 |
| జాతకదర్పణము (చదివినవారు జాతకాలు వ్రాసికోవచ్చు. తేట తెల్గు) | 2-0-0 |
| శ్రీ గురుదత్త సరస్వతీయము (గురుచరిత్ర-తెల్గువచనము-అట్టబెండు) | 2-0-0 |
| శ్రీ శంకరవిజయము (భ. వేం. సు. కృతము. 10 ఆ. ప్రబంధము) | 2-0-0 |
| ఆంధ్రీకృత ప్రసన్న రాఘవ నాటకము ,, | 2-0-0 |
| అద్భుతోత్తర రామాయణము 7 ఆ. ,, ,,) | 1-8-0 |
| శ్రీ వేమయోగీయము (వేమబోధామృతసహితము) 4ఆ. ,, ,, | 1-8-0 |
| శ్రీ గురుభక్తి ప్రభావము (6 ఆ. ,, ,,) | 1-0-0 |
| శ్రీ సౌందర్యలహరి (సమూలము) | 1-0-0 |
| కృష్ణానదీ మాహాత్మ్యము మంచికథలు (4 ఆ. ,,) | 0-12-0 |
| చంద్రహాస చరిత్ర (గద్యపద్యాత్మక నాటకము) | 0-12-0 |
| హరిశ్చంద్ర నాటకము (సులభవచనము) | 0-12-0 |
| శ్రీ శివానందలహరి (స్తోత్రాంధ్రీకరణసహితము) | 0-12-0 |
| రామదాసచరిత్రము (హిందూస్తానీ నాటకము. తెల్గులిపి భాషసులు | 0-12-0 |
| అహల్యా సంక్రందనీయము ,, ,, వుగానలవడును) | 0-8-0 |
| సీమంతినీ చరిత్రము ,, ,, ,, | 0-8-0 |
| భద్రాయురభ్యుదయము ,, ,, ,, | 0-8-0 |
| కీర్తిమాలినీప్రదానము ,, ,, ,, | 0-8-0 |
| అపూర్వదాంపత్యము ,, ,, ,, | 0-8-0 |
| స్త్రీల మీటింగునాటి హరికథ (సుప్రసిద్ధము) | 0-8-0 |
| సులభ వైద్యబోధిని (గోసాయి చిట్కాలవంటిది) | 0-8-0 |
| చిత్రకంద రత్నాకరము (బంధాలబొమ్మలుగలది) | 0-8-0 |
| వేమనయోగీంద్రచరిత్రము (తేలికవచనము బొమ్మలుగలది) | 0-8-0 |
| అంకజ్యోత్స్న (750యుక్తిలెక్కలుగలది) | 0-6-0 |
| ప్రైమరీ పరీక్ష లెక్కల పుస్తకము (52 పేపర్లు) | 0-6-0 |
| చతుర్ముఖి కంద రామాయణము | 0-6-0 |
| హిందీ రామాయణ కీర్తనలు | 0-4-0 |
| మల్లికార్జున శతకము(కందగీతగర్భితము) | 0-4-0 |
| అజ్ఞానధ్వంసిని | 0-3-0 |
| అక్షరాభ్యాసము | 0-3-0 |
| ముక్తికాంతా మణీశతకము | 0-2-0 |
| పురుషోత్తమ కృతి శతకము | 0-2-0 |
| పూర్వకర్మ శతకము 0-1-0, హనుమత్కథా శతకము | 0-1-0 |
| సోమేశ్వర శతకము 0-1-0, టపా హారతి కీర్తనలు | 0-1-0 |

చిరునామా:—నాదెళ్ల మేధాదక్షిణామూర్తి శాస్త్రిగారు, బందరు